# క్రొత్త నమూనా.



'NOVEL IDEA'





R. SESHAGIRI RAO.

నంద్యాల అమేచ్యూర్.

# క్రొత్త నమూనా

(ఆంధ్ర సాంఘిక నాటకము.



రాయసము శేషగిరిరావు, బి.ఏ., బి.యల్.,

గారిచే విరచితము.



నంద్యాల.

1933

మొదటికూర్పు 1000 ప్రతులు.



వెల రు 1.

# నోటీసు.





PRINTED AT THE
VANI NIKETHANA PRESS,
NANDYAL.

# ముఖ్యపాత్రములు.



## పురుషులు.

| | |
|---|---|
| శ్రీనివాసరావు:— | డాక్టరు. |
| కవికుమార్:— | కథానాయకుడు. |
| నంజుండరావు:— | వకీలు. |
| దేశానందస్వామి:— | యోగి. |
| రామరావు:— | మోసగాడు. |
| సుబ్బన్న:— | వంటవాడు. |
| సుభాన్ఖాన్:— | సేవకుడు. |
| నరసింగరావు:— | పోలీస్ సబ్ఇన్స్పెక్టర్. |

## స్త్రీలు.

| | |
|---|---|
| సరోజ:— | కథానాయిక. |
| పద్మావతీదేవి:— | నంజుండరావు భార్య. |
| కమల:— | పద్మావతీదేవి పుత్రిక. |



శ్రీ.

# తొలి పలుకు.



క్రొత్త ఒకవింత. పాత ఒకరోత. పురాణకథలు దంచిన పిండి వంట లయినాయి! సాంఘిక విషయాలు నవ్వులాటాల క్రిందికి దిగాయి! పురాణనాటకాలకు నాంది యెల్లాగో అల్లాగే సాంఘికనాటకాలకు బాలవితంతువులూ—రజస్వలావధువులూ—పంతులుగార్లూ—శాస్త్రసిద్ధాంతా లయినారు! వాళ్లు లేకపోతే రుచించదుగా!

వినండి వినకపోండి. మీ యిష్టం. ప్రపంచం. ఉన్నదున్నట్లు చిత్రపటం దీయాలి! లోకానికి నివేదించాలి. దాన్లోనే ప్రయోజనం. ఇల్లా వుంటే ప్రయోజనం లేదంటారా? అసలు ప్రయోజనం అంటే అర్థ మేమిటి? ప్రయోజనం లేనివస్తు వంటూ వుంటుందా? వట్టి పిచ్చిగాకపోతే! ఈలాటినాటకాలల్లో తెలుచుకొన్నవాల్లకీ తెలుచుకొన్నంత మహాదేవ. వ్యాఖ్యాతల యౌదార్య మేగా! గ్రంథకర్తలకు కీర్తి క్రొత్త నమూనా.

కిశోర్.



శ్రీ

# క్రొత్త నమూనా

## ప్రథమాంకము.

### స్థలము 1. యిల్లు.

[ ప్ర: శ్రీనివాసరావు. (ఈజీఛేర్ పై—సిగరెట్టు కాల్చుచు) ]

ఇది కష్టకాలం! లోకమంతా ఆర్థిక దురవస్థలో మునిగి తేలుతూంది. ఎక్కడ చూచినా "ధనం, ధనం" — అనే మాటలే వినబడుతూన్నాయి. అమాంతంగా యీధనం ఎట్లా మాయమయిందో ఎవ్వరికీ తెలియదు. లక్షాధికారులూ ఒకటే! భిక్షాధికారులూ ఒకటే! ఈకాలం ఇట్లుంటేనేమంచిది. ధనవంతులగర్వం అడుగంటుతుంది. కాని—నాబోటి ఆర్జనాభుక్తుల గతి యేం? రెండు మూడు నెలలుగా చేతుల్లో ఒక్క కాసైనా లేదు. పేరుకా పెద్దడాక్టర్. దర్జా? తగ్గగూడదు. ఇతరుల నడిగితే హేళనచేస్తారు. అడుగకుంటేనా?—జరుగదు. అందుకే అడగడం అనేమాటలేకుండా అప్పు తెచ్చుకోవలె. ఆజ్ఞాయాచన మొదలుపెట్టినాను. అదెంతవరకూ సాగుతుంది? ఇప్పటికే ఒక థౌసండ్ (thousand) వరకూ బయటలాగేశాను. ఎక్కడికని?— కర్చులా? తగ్గవు. ఆదాయమా? క్రమక్రమంగా తగ్గిపోతూంది. ఇంట్లోచూస్తే శ్రీమతిగారి అట్టహాసం జరిగి తీరవలె. తాను వంటచేయదూ. దాసీలు కావాలీ. పరికరాలు తగ్గించితే కష్టం. ఆజ్ఞాపించి కర్చులు తగ్గిస్తామంటే చదువుకొన్నదిగా? వాదిస్తే నాకు నోరాడదు. రూపంలో తక్కువనా? చదువులో తక్కువనా? నాలోనాకే జంకూ. నాఅవస్థ ఏమీలెక్కింపదూ? అబ్బ! దినమూ బయటనుంచీ యింటికి వచ్చేవరకూ ఏదో ఒకటి బేరంచేసి

కొత్తబాకీదార్లను రెడీ (ready)గా గుమ్మంలో తయారుపెట్టి ఉంటుంది. ఈ ఎజుకేటెడ్ వైవ్స్ (educated wives) భర్తల ప్రాణాలకు ఉరిత్రాళ్లే. ఐనా ధైర్యం ఉండవలె. నిన్నటిదినం డ్రా (draw) చేసిన మైసూరు స్వీపు (sweep) నాకే వస్తుందని నమ్మకం....................

[ప్ర: సరోజ.]

సరో:—అబ్బ! కాఫీటైం అయిందన్నా చూడరూ! సుబ్బన్న తయారు చేసి కాచుకొన్నాడు. పదిగంటల భోజనం యింతవరకూ ఉంటుందా?—ఏమాలోచన్లో ఎప్పుడూ? ఇతరులకష్టాలుచూడనే చూడరు.

శీని:—(రిస్టువాచి చూచుకొని) ఏదీ? రెండున్నరేగా అయిందీ! ప్రపంచంలో ఉండే సంగతులన్నీ తమాషాగా ఆలోచిస్తూన్నాను.

సరో:—ఈ వెఱ్ఱి ఆలోచన్లు ఎందుకూ? మీబిల్లులేమైనా వసూలుచేసినారా? లేదా? ఆలోచించేబదులు కలెక్షనుకు ప్యూన్ను పంపకూడదూ? ఈదినం పి. ఆర్. అండ్ సన్సు నుంచీ ఒకపార్సెల్ వచ్చింది. నూటాయిరవైఅయిదు రూపాయలు కట్టవలె.

శ్రీని:—ఏమి తెప్పించావు? నాకు చెప్పలేదే? ఈటైములో పర్చేజెస్ కూడానా? నీకింకా ప్రపంచానుభవంలేదు. డబ్బులేకుండావుంటే యెందుకు తెప్పించావు? రిటర్న్ చేయి.

సరో:—ఆహాహా! మీరు నిజంగా ఏ గవర్నమెంటు ఫైనాన్సుమినిష్టర్ గానో ఉండాలండీ! లాస్టుమంతూ మీ రిస్ట్‌వాచ్ మాత్రం నేను వద్దంటే ఎందుకు తెప్పించవలె? మీకు కావలిస్తే ఒక్కటీ. నా విషయమైతే యింకొక్కటూ? మీవాచి మీకెంతవసరమో, నాబ్రోచి నాకంతవసరం.

శ్రీని:—సరోజా! నీవు స్టూడెంటుగా ఉన్నప్పుడింతరాజకంగాలేవే?

సరో:—మీరుమాత్రం ఇంత లుబ్ధత్వంగా ఉంటిరేమో?

శ్రీని:—ఐ, సే. నన్నిలాతప్పులు పట్టబోతే బాగుండదు. నేను చెప్పిన ప్రకారం వినవలె. ఇద్దరూ ద్వైధీభావమైతే కష్ట మొస్తుంది. నీకూ "ఆర్యకథానిధి"—సతిహితచర్యపుస్తకం తెప్పించిస్తాను. ఒకసారిచదువూ! నీవుపూర్వం మెడ్రాసులో నన్నెలాచూస్తుంటివో ఇప్పుడలా చూస్తున్నావు. అప్పుడూ స్నేహం. ఇప్పుడు కొంచెం భయమూ భక్తీ ఉండవలె.

సరో:—(నవ్వుచు) మీరు మారితేగా నేనూ మారడం? అదేమాట అదేనడక - అదేరూపం - అదే అంతాను. మీపైననాకు భయము, భక్తి ఎలాకలుగుతుంది? భర్తపైన ప్రేమ ముఖ్యం కాని భయమనవసరం. అదీ ఎరెలిక్ ఆఫ్ ఆర్థడాక్సీ (A relic of orthodoxy) అంటారు. సాంఘికనవలలు చదవండి! ఇంకా మీకాడవాళ్ళపైన డామినేట్ చేయవలెననే బుద్ధిపోవాలి.

శ్రీని:—ఇదిగో! నీఉపన్యాసం వద్దు. కాఫీ తెమ్మా!

సరో:—సుబ్బన్నా! సుబ్బన్నా!—కాఫీ ప్లీజ్!

[సుబ్బన్న కాఫీతెచ్చును. ఇద్దఱు త్రాగుచుండఁగా ప్ర: కవికుమార్.]

శ్రీని:—కవిగారూ! రండి. ఏమిలాదయచేశారు?

సరో:—నమస్కారం. చాలారోజులకొచ్చారే? ఊళ్లో లేరాయేమి?

కవి:—లేనండీ! బెజవాడకుపోయి నిన్ననేవచ్చాను. ఏదోపరిషత్తంటే ఉండలేను. ఎన్నిపనులున్నా వెళ్లేతీరవలె. భాషాభిమానం పెద్ద వెఱ్ఱి.

శ్రీని:—నిశ్చయమేనండి! మాయింట్లో సరోజకూడా ఏదో వ్రాస్తూంటూంది. నన్ను నిర్బంధపెట్టి వినిపిస్తుంది. కాని, నాకేమీ దాంట్లో రుచిదొరకడం లేదు.

కవి:—అదీవాస్తవమే! రసగ్రహణం అందఱికిసామ్మాకాదు. శ్రీసరోజాబాయిగారి వ్యాసాలు - ఆశైలీ - ఆపొందికా - ఆబిగుంపూ అవన్నీచాలాఅందంగా ఉంటాయి. మొన్న "గృహలక్ష్మి" లో

వేసినారే— ఆవ్యాసం చాలా మజాగా ఉంది. మనదేశంలో యిలాంటివిదుషీరత్నాలు బయలుదేరితేనేగాని దేశం తరించదు.

సరో.—కవిగారూ! పొగడదగిన శక్తిలేదు. ఈయింగ్లీషు పాండిత్యంవల్ల నా ఆంధ్రం ఎక్లిప్స్ ఐపోయింది. ఈలోపల కొంచెం దానికి మెఱుగూ గిరుగూ పెడుతూన్నా "భారతి" వాళ్లుమాత్రం ప్రతి దానికీ రిటర్న్‌డ్ విత్ థ్యాంక్సనంటి!

కవి:—అదేమిలెండి! నేనూ యీసారి మీ వ్యాసంవెంటా భారతీ కార్యాలయానికో జాబు పంపుతాను. అప్పు డచ్చు వేస్తారు. నాకా ఎడిటర్ ముఖ్యశిష్యుఁడు లెండి!

శ్రీని:—అదేదో చేస్తురూ! — లేకపోతే —

కవి:—అందులో ఒకయుక్తికూడాఉండి. సరోజాబాయి, బి.ఏ.—అని వ్రాయాలి. ఈడిగ్రీతగిలిస్తే తప్పక తీసుకుంటారు. నేను సరి చేస్తా లేండి! ఇంకవస్తునా? — ఆఁ - మఱచిపోయాను. మీ రడిగినది పట్టుకొచ్చాను. కొంచెం తక్కువగా... ఓన్లీ టూ హండ్రెడ్స్.

శ్రీని:—థ్యాంక్స్! ప్రోనోటు వ్రాసిస్తునా?

కవి:—అబ్బె! ఎందుకండి? మనలో మనకూ—మీ కెప్పుడు వీలైతే అప్పుడే యిద్దురుగాని.

సరో.—కవిగారు చాలా మంచివారు.

కవి.—దీనికి మంచేమిటి? ఎవరికైనా సమయం. గుడ్‌బై.

(నిష్క్రమించును.)

(తెరవాలును.)



## ప్రథమాంకము.

### స్థలము 2. ఇంటి ముందు వసారా.

[ ప్రః పద్మావతి—కమల. (జడ వేయించుకొనుచు) ]

పద్మా.—కమలా! నిన్నటిదినం రాత్రియెన్మిది ఘంటలవరకూ యింటికి రాలేదని నాన్నగారు కోపపడినారు. నిన్నుమందలింపమనికూడా చెప్పినారు.

కమల:—లేదమ్మా! నేను డాక్టరుశ్రీనివాసరావుగారింటికి పోయియుంటిని. ఆయమ యేవేళకు రానిచ్చినదికాదు. ఇంకపోనులే. నాన్న అరచినాడా?

పద్మా:—అరువడూమరీ— ఆ సరోజాభాయి మనయింటికి వచ్చిందా? ఎప్పుడు నీవే వాళ్లయింటికి పోవటం.

కమలా:—ఎందుకురాదమ్మా. ఆమెకాగర్వము లేదు. ఇంగ్లీషు చదివింది. కవిత్వం చెప్తుంది. ఎంతవినయం......

పద్మా:—ఆడవాళ్లకు యింగ్లీషు యెందుకే? నాకేమి చదు వస్తుందా? నాకుగౌరవము తక్కువైనదా? సరే పిలుచుకొనిరా.

(కమల నిష్క్రమించును)

[ మరల ప్రః కమల, సరోజా. ]

కమ:—అమ్మా యిదిగో సరోజా భాయిగారు వచ్చినారు.

పద్మా:—కూర్చోండీ— మాఅమ్మాయికి చాలాతొందర. పాపము ఎంత పనిలోయుండినారో? వచ్చినారు.

సరో:—లేదండీ, ఏదో ట్యాగూరునవల చదుతూవుంటిని. ఇంటిలో వంటవాడున్నాడు. వాడే యావత్తుపని చేస్తాడు.

పద్మా:—మాయింట్లో వంటవాండ్లంటేసరిపోదు. మావాండ్లకుకోపము. మేమేచెయ్యవలె. పనివాండ్లంటే, ఎందుకూ? చెయ్యలేరా? అంటారు.

సరో:—అదీవాస్తవమే: అయితే నాకలవాటులేదు. చిన్నప్పటినుంచీ చదువటమే! వంటచేసేదిరాదు. మావాండ్లకూ, యిష్టమంతగాలేదు కాని, వీలులేక అరేంజిచేసినారు.

పద్మా:—మీకు రావలెనంటే ఏమివిద్యలేండి. మీరుకవిత్వంకూడా చెప్పుతారంటగా?

సరో:—ఆ. ఆపిచ్చికూడా వుందిలేండి. నాకాంధ్రభాషంటే జాస్తి మావాండ్లకు నేనెంత జెప్పిన భాషాభిమానమే లేదండి!

పద్మా:—అయితే, మీరు వ్యాసాలు వ్రాసేది మీవారి కిష్టమేనా?

సరో:—అందు తప్పేమి. ఈదేశములో చదువురాక పశువులకంటే హీనంగానున్న మనాడవాళ్లకు, చదువునేర్పించితేనే ధైర్యము కలిగి తమ కార్యములను నిర్వహించుకొను శక్తి కలుగును. పూర్వము వేదముల కర్థము వ్రాసినవారు స్త్రీలేకదా? ఉపనిషద్వాక్యములేర్పరిచినవారు స్త్రీలేకదా? మొగలుసామ్రాజ్యము నౌరంగజేబు పాదుషాకాలములనేకచ్ఛత్రిముగా పాలించినవ్యక్తి స్త్రీయేకదా? మనపురాణములో యమధర్మరాజుభయపడెనా? యెవ్వరికి? స్త్రీ! సావిత్రికి గడగడవడెకనా లేదా? చదువుకొనిన తప్పేమి? ఆవ్యాజాభిజాతములగు భావములు వెల్లడించిన తప్పేమి? మావాళ్లు నన్ను నిర్బంధింపలేరు. వారికి నావ్యాసము లిష్టమువునో కాదో కాని యిష్టములేదని మాత్రము తెలుపలేదు. తెలిపినను నేను మానను.

కమ:—సరోజమ్మగారూ! మనవాళ్లు భర్తమాట జవదాటకూడదంటారుకదా? మీరు వ్యాసాలువ్రాసేది, మీవారికంత యిష్టము కాదంటిరే.

సరో.—అలాకాదు. భర్తమాటజవదాటకూడదు. కాని నేనుభర్తతో పోట్లాడుమన్నానా? మీ ఆత్మగౌరవమును కాపాడుకోవాలి. బ్రహ్మదేవుడు మొదట పురుషులను పుట్టించి, తరువాత వారిని బంధించుటకు స్త్రీలను సృష్టి జేసెను. స్త్రీలందరు పురుషుల

మాట వినవాలనుకోండి. ఈ ప్రపంచములో పురుషజాతిలో దుర్మార్గులుకూడా వుంటారుకదా?

పద్మా:—ఆ!

సరో:—అప్పుడట్టి దుర్మార్గుల మాటలుకూడ స్త్రీలు జవదాటకుండిన సంఘము చెడిపోవును. దేశము నాశనమౌను. సన్మార్గమున పోవువారికి సాయముచేయుట, దుర్మార్గులగువారికి సన్మార్గము పట్టించుట—ఇవి రెండు ముఖ్యధర్మములు.

పద్మా:—ఇది బాగావున్నది. ఎవ్వరూ చెప్పలేదండీ!

సరో:—పద్మావతమ్మగారూ, మన వారింతకు ముందు వేదకాలంలో స్త్రీలకధికారము, గౌరవమిచ్చి యుండిరి. అయితే, తరువాత శాస్త్రార్థముల గ్రహించుకోలేక స్త్రీల నాటవస్తువులుగా నుపయోగించుచున్నారు. చూడండీ—సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయవలెనంటే శ్రీకృష్ణమూర్తి వద్దన్నాడా? సమభావముతో సరియనెనా? లేదా? ఇంతకంటె దృష్టాంతర మెందుకూ?

పద్మా:—ఇది. ఈకాల విపరీతమంటారేమో నండీ.

సరో.—కాదండీ. పూర్వమునుండి నేటివరకు, మన భరతదేశము నింగ్లీషువారు పాలించునన్నిదినము లేరాజులైన పాలించిరా? దీనికి కారణమేమి? ఇంగ్లీషువారు స్త్రీలను మూలలకు దోయక, వారికి తగిన స్థాయి నేర్పరచినారు. అందుకే దేవునికి వారిపైన ప్రేమ.

కమ:—సరోజాభాయిగారూ! మీరు మన శాస్త్రముల నేవైన చదివితిరా? వాటికిని మీయభిప్రాయములకును భేదముండిన......

సరో:—వుండదు. నేను సనాతన ధర్మావలంబిని. సనాతనధర్మము నిరసించుదానినైతే, యీ తెనుగు బాష యందింత పిచ్చియుండదు. నేను వైపరీత్యము లనుసరింపను.

పద్మా:—ఏమో నమ్మా! నాకేమి తోచుటలేదు. మీరు చెప్పేదివింటే బాగుంది. మాఆచారాలను కాదనటానికి భయమవుతుంది కడకు మావారితో మాట్లాడవలె నంటే కూడా భయమే!

సరో:—అదే తప్పు. మీకు ప్రేమ సుఖము తెలియదు ప్రేమకు సమానత్వము ముఖ్యము. దానికి వుచ్చ నీచలు లేవు; కులభేధములు లేవు; ఈ 'ప్రేమ' యనునది యాధ్యాత్మిక తత్వము. ప్రేమకు భయములేదు, సిగ్గులేదు, తగ్గుటలేదు, హెచ్చుట లేదు. ఆదిలేదు. అంత్యములేదు. మీరు మీభర్తతో మాటాడ లేకపోయిన, మీకు సుఖములేదు.

పద్మా:—కలియుగమమ్మా! మంచి చెడ్డలు తెలిసికొనుట కష్టము.

సరో:—మీకు దీని విషయమై చెప్పబూనిన ఘంటలకొలది చెప్ప గలను. మావారు వచ్చు వేళయినది. మళ్లీవస్తాను. ఏదో నా భావములను చెప్పితిని. వేరుగా తలచకూడదు.

పద్మా:—మంచిది. అప్పుడప్పుడు వస్తూవుండవలె. ఈవూర్లో యెవ్వరూ యిలా చెప్పేవారు లేరు. (తాంబూలమిచ్చి పంపును.)

నిష్క్రమింతురు.

తెరపడును.



## ప్రథమాంకము.

### స్థలము 3. శిథిలదేవాలయము.

[ ప్ర: దేశానందస్వామి (కూర్చొని) ]

శా. శ్రీదంబై సకలార్థ భాగ్యనిధియై చింతామణిప్రాయమై
వేదాతీతమునై మునీంద్రహృదయావిర్భూతవిజ్ఞానమై
యాదేవేంద్రసురాదివంద్యమయి భక్తాధీనమై లోకర
క్షాదక్షంబగు రామనామమహిమాసారంబు సామాన్యమే.

రామా! పరంధామా! నీనామస్మరణ మాత్రమున నెట్టి విపత్తులు తొలంగవు? నీకంటే నీనామ మహిమం బెక్కువ. నీనామము సాంబశివునకును, ప్రకృతం గాంధీ మహాత్మునకు గోచరము. పామరులకు తెలియ సాధ్యమా?

సాక్షాత్ శ్రీకాంతుండవైన నీదేవాలయమున కిట్టి దురవస్థయా? శ్రీమహాలక్ష్మి నీయురమున తాండవమాడుచుండ, నిఖల నవరత్ననిధియగు సముద్రుండు నీమామ యగుచుండ, సప్తజలధిప్రావేష్టితాఖండ మండల భూసతీకాంత నీప్రేయసి యగుచుండ, నీ యాలమునకీ దుస్థితియా? ఈ శిథిలాలయనివాసము తప్పక పోయెనుగదా? నీగతియే యిటులుండ మాగతియేమి? మీరు పలికించిన వాక్యము సత్యముకాక పోయినది. "పొగడ బిక్షము బెట్టరే పుణ్యసతులు, ధనమదాంధుల కొలువేల తాపసులకు"—పోతనతో బల్కించితివే సత్యమా? దాన ధర్మము, లర్థిపూజలు నేటికాలమున కలవా? జేనెడు పొట్టకై పరుల నాసించుట దోసమే కాని, వేరుగతి లేదు కదా? సాధువు లుండుటకు వసతి యెక్కడ? "కరతలభిక్ష, తరుతలవాసం" అవి యిప్పుడుదొరకవు తమనిరర్థక వ్యాసంగములకు వేలనూప్యములనైన వ్యయము జేసెదరు. బిక్షయొసిన రక్షకభటుని తలచెదరు. పోతన వచించిన పుణ్యసతుల

కిష్టూను వ్యవధియే లేదు. వారు తమ నలంకరించుకొనుటలో, విలాసార్థముగా పొద్దుపుచ్చుకొనుటలో నున్నశక్తిని బీదసాదలపై వెచ్చించి గృహస్థాశ్రమ ధర్మ నిర్వాహణకు పూనుకొనరాదా? వారి నననేల నీకాలమున సత్యముగ సన్యాసి యొకడుండిన వేలకొలంది కుహానా సన్యాసులు లోకముఁ గొల్లగొట్టుచున్నారు. పాపము! విచక్షణాసేదు జాలమి, రెండు రకములవారిని దూరముగా దోలుచున్నారు.

సీ. కర్మసన్యాసమే ధర్మసమ్మతమంచు
నటియించు కపట సన్యాసియొకడు
దేశసేవయటంచు తిండితీర్థంబుల
నార్జించు కుమతి సన్యాసియొకడు
పేదరైతులబట్టి బాధించి కాంగ్రెసు
నామంబు చెరచు సన్యాసియొకడు
శరణాలయాలకై చందాలను గ్రహించి
యాసించునట్టి సన్యాసియొకడు

గీ. భరతదేశము! నీయింట వరలుచుండ
సాధువర్గము కెందు విశ్రాంతిశాల?
గతము స్మరియించుచుంట సౌఖ్యంబుగాని
ప్రకృతము దలంప గుండియల్ భగ్నమనవె.

లోకము ధనవశ్యమైనది. శ్రీమహావిష్ణువు లోకరక్షణాశ్రమంబున తనభారంబును లక్ష్మీదేవిపై వదిలె కాబోలు. అందుకే యీ ధనికుల గర్వము. అందులకే యీరాజకము—స్త్రీపాలన కదా?

పాశ్చాత్యులు సైతము భరతదేశమునకు వేదాంత దేశమని పేరిడి యున్నారు. మతస్థాపకులు జన్మించిన నిందు జన్మించవలె. "భానుడుదయించు ప్రాగ్దిశాఫలకమందని వాడుక. ఈ భరతదేశమున కింతకంటే యభినందనము కావలయునా? మేధావంతులగు భార

తీయులు పరానుకరణాశృంఖలలచే బంధింపబడి, చిక్కి, కృశించి, స్వాభిమానము వీడుచున్నారే! అక్కటా యెన్నడు భరతమాత నిజ స్వరూపమ్ము కన్నులపండువుగా నగుపించునో కదా!

(ఇటునటుచూచి) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. ఇట నుండ రాదు. (లోనికి పోవును.)

[ప్ర: రామారావు, పద్మావతి.]

రామ:—ఇదిగో పదే పదే నన్ను మోసగించు చున్నావు. ఇప్పుడైన తెచ్చితివా? లేదా? ఊరకే రిక్తహస్తములచే శాంతింపను.

పద్మా:—రామారావూ, యిరవై సంవత్సరముల క్రిందటికథ వెలి బుచ్చి నా సంసారము నేల నాశనము జేసెదవు? సాధ్యమయి నంత పైక మిచ్చుచునే యుంటిని గదా? ఏల బాధించెదవు.

రామ:—అట్లుగాదు. పైకమంతయు నివ్వవలయును. లేనియెడల నీ ఫలము నీవే యనుభవింతువు. (అనిపోబోవును.)

పద్మా:—అయ్యా, కొంచెము నిలువుము. ఇప్పటి కిది తీసికొనుము. ఒక నెలలోపల నెటులైనను సవరింతును. (హారమునిచ్చును.)

రామ:—(తీసికొని) నిన్ను నమ్ముట కష్టము. నీరహస్యము నాచేతిలో నున్నది. జాగ్రిత. (హారమును జేబులో నుంచుకొనుచుండగా నొక జాబు క్రిందపడును).

(ఇద్దరు నిష్క్రమింతురు.)

దేశా:—ఏమిది. ఆశ్చర్యము. పక్కీలు నంజుండరావుగారి భార్య యీతని చేతిలో నేల చిక్కుబడినది? వీరిరువురి రహస్యము లేముండును? (అని క్రిందపడిన జాబు తీసికొని)

నరహరికి,

నీవు యిన్ష్యూరెన్సు కంపెనీ యేజంటుగా రామరావను పేరుతో తిరుగుచున్నావని తెలిసి, చాలా సంతోషించు

చున్నాను. పోలీసువారు నీకేసు విషయం మానుకొన్నారు. అచ్చటనైనను సుఖముగా కాలము గడుపుకొనవలెను. విశేషములు లేవు.

బెంగుళూరు.

ఏమిది. ఈతడు వేషధారియా, యీదృశ్యము విపరీతము. ఇతనిపై నున్న కేసులేమి. అట్టి యీదుర్మార్గునితో నీసతీలలామకు పని యేమి? ఈసంగతులు విచిత్రముగా నున్నవే.

దేవా! పరమేశ్వరా! ఏమి నీవిధానము! తళతళలాడు కనకపేటికయందే క్రిమికీటకాదులను బెంచుచుంటివా? లోకము కనుల కొకటి, యనుభవింపగానొకటియై యున్నదే.

నాజీవమును పరోపకారార్థము, దేశసేవార్థ మంకితమొసంగితిని. ఇచట నాపై యొక బాధ్యత యున్నది. ఈ రహస్యము గ్రహించి నంజుండరావుగారి గృహమునుద్ధరింపవలెను. నంజుండరావువంటి శాంతస్వభావుఁడును, ధర్మాచారపరాయణుడు వేరుండునా? ఈ ప్రపంచమున నానందనాటక మాడింప లేక విషాద నాటక మాడించుటయే దేవునకు ప్రీతియా?

మ. సిరికిఁ దావలమై మనోహర వనశ్రీశోభితంబై, సుధీ
వరశౌర్యప్రకటంబునై నిఖలభవ్యద్వేద వేదాంతభా
స్వరమై పశ్చిమఖండదీపకళికా ప్రాయంబునై వెల్గు నీ
భరతామ్నావని పాదసేవకుఁడె వాహ్వా! యెంతధన్యాత్ముఁడో?

అట్టి యీభరతమాతకు నాజీవిత మంకిత మొసంగితిని. పరోపకారమే దేశసేవ యనదగును. ఈ దేశసేవచేఁ నీజీవితము తరింప చేసెదను.

(తెరవాలును.)



శ్రీ.

# క్రొత్తనమూనా

## ద్వితీయాంకము.

### స్థలము 1. ఇల్లు (డాక్టరుగారిది).

[ ప్ర: సరోజా కూర్చొని ]

సరో:—వ్యాసము పూర్తియైనది. వీలుండిన వచ్చి వినవలయునని కవి గారికి చెప్పిపంపితిని. అతడువచ్చునో? రాడో? చెప్పిపంపుటయే తప్పుగాదలచునేమో. కదా?

కవి:—సరోజాభాయిగారూ, నమస్కారము. ఆలస్యమైన యెడల క్షమించెదరుగాక.

సరో:—అయ్యో, మీకు శ్రమనిచ్చితినని నేను జంకుచుండ మీరు క్షమాపణ వేడుటయా? నేను "ప్రేమానుభవము"ను వ్యాసము వ్రాసితి నండీ.

కవి:—శీర్షికయే మధురముగానున్నది. వ్యాసము తప్పక బాగుండును మీభాషాగౌరవ మితరస్త్రీలకుండిన, నాంధ్రసారస్వత మెక్కు డుస్థితిలో వృద్ధిపొందదా? మీరు ప్రేమానుభవమని వ్రాసి తిరి కదా? ప్రేమకర్థము తెలిసికొనుట కష్టము! మీరు ప్రబం ధము లేవియైన చదివితిరా?

సరో:—చదివితిని. ఒక్కదానిలోనైనను ప్రేమను సరిగావర్ణింపలేదు. రాధికాస్వాంతనమున మాత్రము ప్రేమయందలి యెక్కుతరం గమునే ముద్దుపళని చిత్రించినది.

కవి:—ప్రేమవిషయములను వ్రాయుటకు స్త్రీలే స్వతంత్రులు. పురుషులు ప్రేమను కామముగా పొరబాటుపడుచుందురు. మీరు మనుచరిత్రలోని ప్రవరాఖ్యునిపాత్రను పరిశీలించితిరా? అందు మీ అభిప్రాయమేమి?

సరో:—పెద్దన ప్రవరాఖ్యుని బాగుగా తయారుచేయలేదు. వరూధిని వరించి ప్రార్థించి, యాచింప "శ్రీహరీ" యని మోరమోమిడుట రసాభాసముగా నున్నది.

కవి:—నాయభిప్రాయము నదే. మన కిరువురకి భావము లొక్కటిగా నున్నవి.

సరో:—కవిగారూ, మీరు దేశీయవిషయములనుగురించికాని, సాంఘికవిషయములనుకాని వ్రాసినట్టులేదే.

కవి:—నాదొకమతము. దేశసేవ వ్రాయుట యందుండిన లాభము లేదు. ఆచరణయందుండవలెను. నే నాచరించుచుంటిని. నేను వ్రాసినగ్రంథములు భక్తిశృంగార భూయిష్టములుకాని దేశీయ విషయములు తక్కువ.

సీ. ఖాదీదుకూలముల్ గట్టినయంతనే
దేశాభివృద్ధికి తెరవులేదు
సాంఘికోపన్యాస సరణిమండినయంత
భారతదేశంబు బాగుపడదు
టోపీలుబెట్టుక పాపులనాపిన
స్వాతంత్ర్యములు ముందు సాగబోవు
కారాగృహంబులు కోటినయంతనే
శ్రీగాంధి మంత్రంబు సిద్ధిగాదు

గీ. కేవల ప్రదర్శనంబులచేవలేదు
గేహసంఘపురంబుల సాహసించి

సంస్కరించిన యప్పుడా ఋణమునందె
భరతమాతకు శృంఖలల్ బాసిపోవు?

విదుషీమణీ, బాహ్యానటనలచే దేశసేవ లభింపదు. ఆత్మనిగ్రహముచేత పరోపకారములచేత దేశాభివృద్ధికలుగును. కావలసిన పనిచేసిన సరి. నీయట్టి చదువుకొన్నవారు తలపెట్టవలెను. నాదేశము నాయందున్నది. దేశసేవ చేయవలయుననిన, నన్ను నే నుద్ధరించుకొనవలెను. అందుకొరకే నా కిచ్చెదనని Probationary Deputy Thahasildar పనికూడావలదంటిని.

సరో:—మీ కేమిభాగ్యవంతులు. వుండినది చాలదా? మీమాటలు చాలా అద్భుతముగా నున్నవి. కానీ......మీగ.—

కవి:—సరోజాభాయిగారూ, నేనొకవిపరీతవ్యక్తిని లెండు.

సరో:—ఒకమాట, యింతవరకు మీరు మావారికి మిత్రులు. నాకు పరిచితులు. ఇప్పుడీ కవితాగోష్టివలన పరిచయము స్నేహముగా ఫలించినది. కావున 'గారూ' 'మీరు' అను సంబోధించుట సంగతము. 'సరోజా' యనిన చాలును. ఆధునికభావముల పూర్వగ్రంధములలో నెచ్చటనైన చూచితిరా?

కవి:—శేషము వెంకటపతి వ్రాసినాడు.

మ. లోకములోన కొందరబలుల్ సతులఁ దనియింపలేక న
స్తోకమనీష! యన్యపురుషుల్ దపుకాంతలనంటకుండ తా
టాకులలోనవ్రాసిరి పరాంగనఁ గూడిన పాపమంచు నా
యాకులపాటుచూచి యిపుడాకుల పాలెనయంగ నేటికిఁ.

ఈభావము ప్రస్కృతము చెల్లుచున్నది. ఇది కొందరి మూలమంత్రముగా నున్నది.

సరో:—రాజారావు, యీ భావము స్త్రీల పాతివ్రత్యభంగకారియై, అనాచారకారిగా నున్నదేమో?



కవి:—వినండి. పంచమ వేదంబగు భారతములో శాంతిపర్వమున తిక్కన వ్రాసిన భావము. పరపురుష సంగమంబున పరిహృతమైనట్టి కాంత, మరల రజస్వలయైన శుచియై శుభకార్యాధికారము కలిగియుండునని వచించెను.

సరో:—ఏమీ? వందనీయమగు భారతమందింట్లు వ్రాయబడినదా? అబ్బ! మనవారిలోనున్న భిన్నాభిప్రాయములు, పరస్పరఖండన లున్నమతి పోగొట్టుచున్నవి. పాశ్చాత్త్యులమతము, వింతయైనను సర్వజనాహ్లాదకారియై యొకమార్గముననే బోవుచున్నది.

కవి:—సుమతీ, నీవంటివారికి తెలియని విషయ మేముండును?

సరో:—మీకు నాంగ్లకవులలో నిష్టులెవరు?

కవి:—నేను కీట్సు, షెల్లీభక్తుడను. ఆనందోబ్రహ్మాయను మత మవ లంబించితిని. స్త్రీలనిన నేను చుల్కనగా చూచువాడను. మీ శక్తి సామర్థ్యములను గ్రహించిన తరువాత, నాయందు గౌరవ ముదయించు చున్నది.

సరో:—నన్ను, నాసహపాఠీలు రసాస్వాది (Bohemian girl) అను వారలు. నాకెప్పుడు ఆనందం సుఖము కావలె. ప్రపంచము నాటగా దలంతును.

గీ. ఏను స్వేచ్ఛావిహారిణి నేననంత
భువనకల్యాణ చిత్కళామూర్తి నేను
కష్టమనుమాట లేదు నిఘంటువందు
భావ సామ్రాజ్యసౌఖ్యసంప్రాప్తి దక్క.

కవి:—ఆహా, ఏమి నీకవితాప్రాగల్భ్యము! నీవు నిజముగా నీకవితవలె స్వతంత్రివి. నీవంటివారి స్నేహము కలుగుట నాభాగ్యము. నా జీవితమందు నీవంటి భావవిహారిణిని దర్శించియుండలేదు. దేవుడు

మనస్నేహమున కమరత్వమొసంగుగాక? ఈ జీవి సేవనీయాజ్ఞా బద్ధమనుకొనుము. సరోజా!........నేను......ఊ......పొద్దుపోయినది. పోయివచ్చెదను సెలవా?

సరో.—ఏదో చెప్పదలచుకొని చాలించితిరే? పూర్తిచేయరూ?

కవి.—ఏమీలేదు. నీ...వాఙ్మయతి నన్ను ముగ్ధుని గావించినది. అందులకే భ్రమించితిని. నీభాషావైఖరి యపూర్వము. నీవు నిజముగా నపూర్వవ్యక్తివి. కాని ఈసారస్వతస్వారస్యము మన శ్రీనివాసరా వానందింపలేడోమో?

సరో:—అదియొక చిక్కు. వుండనిలెండు. మీరు దర్శనభాగ్యము కలిగించుచుండవలెను.

కవి:—వింతమాట. మీరాహ్వానింపక పోయినను, దినిమునకొకతూరియైన వచ్చుచుండెదను.

సరో:—నమస్కారము.

నిష్క్రమించెదరు.

తెరవ్రాలును.



## ద్వితీయాంకము.

### స్థలము 2. సౌదశాల (సమావేశము).

[రామారావుగారు, వుపన్యాసవేదికపై]

రామ:—అధ్యక్షా, సోదరులారా,

నేను చెప్పదలచుకొనిన సంగతులన్నియు, నాకంటేముందుపన్యసించినారు. భారతదేశమున, దత్తమండలము నికృష్టమనియు (absurd) నిందు సాంఘిక దురాచారములు, మత వైపరీత్యములు వృద్ధిబొంది, శాస్త్రములు చైతన్య హీనములై యాచరింపబడుచున్నవి. కడకు కొందరు "Ceded Districts' mentality" దత్తమండల గుణమనికూడ వాడుచున్నారు shut up. కావునమీరందరు దత్తమండలమును వృద్ధికి తీసికొని రావలయునని ప్రార్థన (Thanks, sitdown.)

కవి:—(లేచి నమస్కరించి)

సభాసదులారా!

నేడు చర్చనీయాంశము సంఘసంస్కరణ. ఆదిమోపన్యాసకులు తద్విషయమును దెల్లముగ వెల్లడించిరి. సంఘసంస్కరణ వలయుననిన యుపన్యాసములచే గాదు. కాని యీవిషయ మధ్యక్షులవారే మాట్లాడగలరు.

ప్రకృతం పూర్వోపన్యాసకులగు రామారావుగారు వచించిన కొన్నియంశములన్ని విశదీకరింప దలంచుకొన్నాను. (come on.)

ముఖ్యముగ "సీడెడ్డిస్ట్రిక్ట్స" ను పదమునకు దత్తమండలమని వాడుటతప్పు. దానికి అనువాద మెరుంగనివారు దోసమారోపించుటయా? (Hear.)

భారతదేశమున జన్మించిన యాత్మగౌరవమును విడనాడి, కొన్నిసీమల దూషించుటయా—దేశభక్తిలక్షణము.

దత్తమండలము నికృష్టమా? చెవులకంటే కొమ్ములు ముందా? కన్నతల్లిగొడ్రాలయ్యెనా? దినమణికంటె దీపమే తేజస్వంతమా? అయ్యా, హిందూదేశచరిత్రయందొక అధ్యాయ మావరించిన విజయనగరసామ్రాజ్య ప్రాభవము లెక్కడ? చనిననాళ్లల పెనగుకత్తులు సానబట్టిన కొండలుండు దుర్గములెక్కడ? (Come on that song please) కృష్ణాతుంగభద్రాశీతలశీకరములెక్కడ? గంగాస్నాన తుల్యమగు తుంగాపానము సులభముగా దొరుకుటెక్కడ? దక్షిణ హిందూదేశమున వజ్రములు దొరుకు స్థలమెక్కడ? సకలసంజీవమూలికోద్దీప్యమగు ద్రోణగిరీంద్రమెక్కడ? వేదకాలమునాటినుండి భక్తజనసాక్షాత్కారుండగు శ్రీశైలమల్లికార్జునక్షేత్రమెక్కడ? వైష్ణవసంఘమున కాదిమఠమగు నహోబలమెక్కడ? కలియుగసాక్షాత్కారుండగు వెంకటేశ్వరుని వాసమున కాదియెక్కడ? రెడ్డిరాజుల కీర్తియెక్కడ? సహజపాండిత్య పోతనామాత్యకవీంద్రు డెక్కడ? ఆంధ్రకవితాపితామహు డెక్కడ? కల్పనాకవి యెక్కడ? ఆంధ్రనాటకపితామహు డెక్కడ? అయ్యా, సోమనాథేశ్వరుని గంగలో ద్రోసిన తురకలు మాశ్రీశైలేశ్వరు ప్రాకారమైన తేరిచూడగలిగిరా? అట్టి యీపుణ్యభూమిని—విఖ్యాతసీమ—మారాయలసీమ నికృష్టమా?

ఏమీ? గుణమెంచితివా? ఆహా! తెలియదుకాబోలు. తెలిసిన నీసీమర్థిజన కల్పతరువు, పాంథుల విశ్రాంతిశాల, యాచకులకు నిధి, విదేశీయులగని, సహనసీమ. దీనిగుణమా? (apology) అయ్యా దానకర్ణుడగు బుడ్డా వెంగలరెడ్డిని మరచితివా?

అన్నా, కన్నులు తెరవుము. ఏటుకోర్తురుగాని మాటకోరరు. పోటి మగటిమిచూపు వీరచైతన్యమున కాకరము, వీరరక్తమత్యుష్ణము గాబారు నీసీమజనుల నలయింపకుము. అయ్యా నీవుచేసినపాపమునకు, కుముద్వతీజలంబుల ప్రోక్షించుకొని మా రాయలసీమ మూర్తిని దలంపుము.

సీ. తుంగభద్రయుకృష్ణ శృంగారలీలల
క్రమముగా వింజామరములువీవ
బళ్లారిమండల పట్టణసీమలు
ముత్యాలహారమై మురువుజూప
ఘనవీరవిలసిత పెనుకొండగుత్తులు
గురుకుచద్వయముగా గులుగుచుండ
పరమపుణ్యక్షేత్రమరుణగిరీంద్రంబు
సౌవర్ణకాంచియై సౌరుచూప
తే. గీ. శ్రీగిరీశ్వరమందు నాసీనయౌచు
పాదసీమనుదోర్నాల వేదినుంచి
'కడప' పైయూని వీరశృంగారమూర్తి
వెలయు మాసీమ—రాయల విజయసీమ!

"Beauty once more" అట్టి మా మాతకు దోషమారోపింతువా? తెలియదుకాబోలు. తల్లీ విజయరాజ్యలక్ష్మి వేరుగాభావించక యీ దాసరావును క్షమించును.

ఒకనాడుకలదు నీప్రకటయశంబులు
నవఖండమండలి నాన్పుదినము
ఒకనాడుకలదీవు 'ఓ' యనినంతనే
వైరివర్గము గుహల్ చేరుదినము
ఒకనాడుకలదింట సకలధనంబులుం
రాశియైనిల్చి పారాడుదినము
ఒకనాడుకలదతి సుకుమారకవితలీ
సీమలచేరి వసించుదినము

మరువగాలేము తల్లి నీమాన్యచరిత
కాలవశమున కొంచెము సోలినాము

బారుచున్నది యుత్కృష్టవీరరసము
దివ్యగుణపూత రాయులదేశమాత.

మహాజనులారా! నాకర్తవ్యము ముగిసినది. మీకు నేను మీ మాతృదేవీ స్వరూపమును చూపించితిని. సెలవు (Cheers).

దేశా:—అయ్యలారా, అమ్మలార, (వుపన్యసించుట కొకనిమిషము సైముపొంది.)

నేనొక రిటైర్డు వుద్యోగిని. అనేకదేశములు చూచితిని. సంఘము—సంస్కరణ—ఈరెండుపదము లిటీవల జన్మించినవే! వర్ణాశ్రమ ధర్మములకు లోటులేనంతవరకు సంస్కరణ కవకాశము లేదు. సంఘ మనిన సంస్కరణ యందురు. సంస్కరణ యీకాలపు టంటురోగము లలో నొకటి. (అధ్యక్షుని ఆజ్ఞపైన గూర్చొనును.)

అధ్య:—స్వామిజీ, క్షమింపుడు......పొద్దయినది. నన్ను...గొప్ప చేసినందుకు...నమస్కారములు...జాస్తీ చెప్ప లేను...నాకు యీవిషయమందంత...పరిచయము లేదు...ప్రథమోపన్యాసం వింటిరి...తరువాత...సనాతనమార్గము వింటిరి...మీకేది... సమంజసమో...అదే...అవలంబించుడి...నాకు...సంస్కరణ అంటే గిట్టదు...రాజా కవికుమార్ వుపన్యాస మద్భుతముగా నున్నది...సభ చాలింతము.

భరతగీతము పాడెదరు.

తెరబడును.

---

## ద్వితీయాంకము.

### స్థలము 3. వీధి.

[ ప్ర: దేశానంద, రామరావు. ]

రామ:—భావాజీ, మీ దేయూరు.

దేశా:—నాది తమిళదేశమున నొకనాటుపురము. సంచారార్థము వూరూరు తిరుగుచుందును. నాకు సంసార వ్యాసంగము లేదు. జీవితము సిట్టులే గడుపుచుందును.

రామ:—మీకు నేనొక్క వుద్యోగ మిప్పింతును. నా వెంట నుండెదరా?

దేశా:—నాకు వుద్యోగము లక్కరలేదు. వేతనము లవసరము లేదు. నావలన మీకు కాగలగిన సాయముండిన అవశ్యము చేతును. కానీ తమరి పేరు?

రామ:—నర...కాదు రామారావు.

దేశా:—(నవ్వునాపుకొని) తమ గ్రామము. యిచ్చట చేరి యెన్నిరోజు లయినది.

రామ:—షుమారు రెండు సంవత్సరములయినది. నా స్వగ్రామము చిత్తూరు.

దేశా:—మిమ్ముల బెంగుళూరులో జూచినట్లున్న దే. తమ రేమైన అచ్చట నుంటిరా?

రామ:—(కొంచెము నిధానించి) లేదు. ఏదైన ఒకటి రెండురోజులు విలాసార్థముగా పోయియుందునేమో? పోనీ మీరు మా వెంట వత్తురా? అన్నపానాదుల నేనే విచారించుకొనెదను.

దేశా:—స్వామీ, నేనొక చోట నుండువాడను కాను. నాతో పని యుండిన అవశ్య మాచరింతును.

రామ:—సరియే దయ యుంచవలెను. (అని పోవును.)

దేశా:—పాపము నే నీతని రహస్యము తెలిసికొనవలెనని కంకణము గట్టితినని తెలియదు. ఈశ్వరా,

అనుబంధము. నిష్క్రమించును.

# ద్వితీయాంకము.

## స్థలము 4. యిల్లు. (నంజుండరావుగారి గృహము.)

[ప్ర: నంజుండరావు.]

నంజు:—కొంచెము పద్మాయిటురా,

ప్ర: పద్మా.

నంజు:—నీకుమార్తె కమలకు పదునాలుగు సంవత్సరములు మించిపోవు చున్నవే, పెండ్లివిషయమేమైన ఆలోచించితివా?

పద్మా:—నేనేమి ఆలోచించవలెను. అంతయు మీరేకదా నిర్వహించ వలసినది.

ఇంతలో (రాయులవారూ) అనుచు ప్ర: పురోహితుడు.

నంజు:—రండి. స్వామీ, సకాలమునకు వచ్చితిరే. మా కమలా వివాహ విషయ మాలోచన చేయుచున్నాము.

పురో:—ఆలోచనయేమి. మీరు కావలయుననిన, వకీలు నారాయణ రావుగారి కుమారుడు లేడా? సుబ్బయ్యపంతులుగారి కొమా రుడు లేడా? యెన్నిసంబంధాలు కావలెనంటె అన్నియున్నాయి. మీరు రజస్వలానంతరవివాహం చేస్తారేమో అని అడుగ జంకు చున్నాము. ఈదినం సాయంత్రికి కుదురింపనా?

నంజు:—అట్లుకాదు. రజస్వలానంతర వివాహములు చెయ్యటం నా కిష్టము లేదు. మాయింటిలో ఆడవాళ్లు పదహారుసంవత్సరములు కాని రజస్వలుకారు లేండి. అందును తాత్సారము చేసినాను. కాని, మన రాజారావుకు యిచ్చిన బాగుండునేమో అని ఆలోచన.

పురో:—ఓ బాగుంటుంది. పిల్లకాయ కిరవైయయిదు సంవత్సరములు ఆస్తి గొప్పది. బుద్ధిమంతుడు కవి. కాని, పెండ్లిచేసికొనడని యింతవరకు వాడుక. అయినా [illegible]

లేదండీ. కొంచెము త్రోవదప్పినాడా అని నాఅనుమానంచెప్ప వద్దుమరీ.

పద్మా:—ఆయన సంగతిచూస్తే అనుమానంగానే యున్నది.

నంజు:—ఛీ. నాకు తెలుసును. కొంచెంవిలాసంగా వుండటంచేత అనుమానాల కవకాశమయినదేమో కాని, చాలా మంచివాడు. చిన్నతనం, స్థితి, ఆపాటి షోకయినా యుండదూ మరి? తమాషాగా కవికుమార్ అనిపేరు మార్చుకొన్నాడు.

పురో.—కట్నం జాస్తి అడుగుతాడేమో?

నంజు:—ఆతనికి కట్నమంటూనే సరిపడదు. కావలెనంటే నా ఆస్తీ యంత యతనిదే, నాకేమికావాలి? ఏకపుత్రి విషయము!

పురో:—బ్రహ్మఘటన యెట్లున్నదో? జాతకం కుదురవద్దూ? జాతకం కుదురకపోతే యివ్వవద్దండీ. నాకు అనుభవంజాస్తి. నాకుమార్తెను పుల్లాపంతుల రామయ్యకుయిస్తే పెండ్లిచేసిన రెండేండ్లకే ఫైసల్! పాపము అది మూడవ పెండ్లే, ఒకవెయ్యి. శుల్కము కూడా యిచ్చియుండె. తరువాత ఆలోచిస్తే కుజదోషం వుండినదంట.

నంజు:—కాదుస్వామి మూడవపెండ్లివానికిచ్చినప్పుడు కుజదోషమేమి.

పురో.—లేదండీ! కర్మ బుద్ధ్యానుసారిణి అన్నారు. కర్మను జయించటం చాలాకష్టము. జయమేజయుకథ విన్నారుకదా! శుకభారత కథకు కారణము.

నంజు:—పోనివ్వండి. జాతకం చూచుకొనుట తర్వాతపని ముందు రాజారావు నాలోచించవలెకదా.

పురో:—వకీలు నారాయణరావుగారి కుమారుడు మీ అమ్మాయికి తగినవరుడు. మీరు 'వూ' అంటె నే 'నేమి' అని విచారిస్తాను. మాఅన్నగారు మీయింటికి ముఖ్యము మంత్రిపురోహితులు. ఆయన మరణించిన తరువాతనే నావుద్యోగమువూని

నాను. మీాయింటిలో ఏమి హావ్యకవ్యాలు జరుగలేదుగా?
అందు కంత మాపాండ్యత్వము పరిచయములేదు. నేను జ్యోతి
ష్యము బాగా చదివినాను. మీాకు తెలిసేవుంటుంది?

పద్మా:—స్వామీా, నాయిష్టము నారాయణరావుకుమారునికి యిచ్చిన
బాగుండునని. ఆయన యిల్లు యెంత బాగకట్టినాడో?

నంజు:—నీకేమి తెలియును? ఆయన యిల్లు ఆయనతోనే చెల్లు. తరు
వాత డుల్లు.

పురో:—ఆలాగే వుంటుంది. ఆయమకేమి తెలుసును లెండి. చిత్తము.
శుభస్య శీఘ్రం లేకుంటే వ్యాఘ్రమన్నారు. రేపు మాటలాడి
హెచ్చరించి వస్తాను లెండి.

నంజు:—రేపు బాగావున్నదా?

పురో:—దినవారనక్షత్రపంచాంగసిద్ధాంతములు బాగా యున్నవిలెండి.
మీారు దయయుంచవలె. (అనిలేచి) అటులనే యింకొకచోట
కూడ హెచ్చరించి వస్తునా?

నంజు.—సరే. మీాకు చెప్పినపని చేసికొనిరండి.

(పురోహితుడు నిష్క్రమించును.)

నంజు:—పద్మా, కమలతో రాజారావు విషయం కొంచెము సూచన
చేసిచూడు. తరువాత ఆలోచనచేస్తా. రాజారావు తగినవాడు.
కొంచెము కాఫీ తే. ఈలోపల నేను చాలా శ్రాంతించినాను.
నాపైనకూడ నాగరీకము వ్యాపించినట్లున్నది. ఏదో కాలమహా
త్మ్యము. (కాఫీ త్రాగును.)

(తెరవాలును.)



శ్రీ.

# క్రొత్త సమస్య

## తృతీయాంకము.

### స్థలము 1. ఇల్లు (రాజారావు కవికుమారుని గృహము).

[ ప్ర: కవి. ]

"ఆవిప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునఁ లోహమై
గ్రావంబై దృఢదారువై, తరుణవృక్షంబై, ఫలప్రాయమై
పూవై, తన్మకరందమై, కరఁగి బోపో నీళ్లకుఁ బల్చనై".

(వైజయంతీ).

ఆళ్వారుకథయే అట్లయిన నాగతియేమి? కాని నే నే స్థితిలో నున్నాను? నీళ్లకుఁ పల్చనై ఆవిరియై యెగిరెపోపోగాలికిఁ "మీఁదటఁ అంటే బాగుండును. కాని గణయతి ప్రాసములు కుదురవే! పోనీ యీ కాలపు భావకవిత్వ మనుకొందును. ఏల వేల నగుచుంటిని? సహజ స్నేహభావ విలసితయగు నామెపై నాకేల యీభ్రమ?

స్త్రీలు యెంతటిసాహసులు. ఛీ. హృదయమా, సరోజ సాహసించెనా? ముగుద, వేల మాటలాడినంత విపరీతభావము లేల?

చెలియలిచూపులఁ మనసుజెప్పక చెప్పెడి మోవి గీటులుఁ
గులుకుల మేనిడాలు నవగుంఠనమే చిరునవ్వు చూచి నన్నెగా
వలచిన దంచు నెంచెదరు పాపము! కాముకు లెంతమాత్రముఁ
దలపరు, కామినీ సహజధర్మము నైజముటంచు నాత్మలో.

నేను కాముకుడనై యిట్లు భావించుచుంటిని. ఆయమ చదువు కొన్నది. కవి, వక్త, రసజ్ఞ. మాటలాడిన యేల విపరీతభావము? నే పొరపాటుబడితిని.

పొరబాటుపడితినా? లేదు. రవిగాంచనిచో కవిగాంచునేకదా. నేను గుర్తెరింగితిని. ఆయమకు నాపైన ప్రేమ కలదు. నన్ను చూచి భ్రమించినది. నాకై విరహతాపము బడుచున్నది. లేకున్న మొదటనుం డిన (imposing) ప్రకటభావములు యిపుడేల వ్రీడాన్వితములయ్యె. నన్ను చూచిన ఘంటాపథముగా మాటాడుకాంతధ్వని యేల గద్గదిక పూనుచున్నది? జంకులేని శరీరమున నన్నుచూచిన తొట్రుపాటు గలుగుచున్నదేల? ఏల? ప్రణయము. కామవిలాసము.

ఆహా! ధన్యుడను నేనేకదా! బాళిని తానె పైబడెడిభామిని బిగ్గకవుంగలించినఁ జాలదె. ఇంద్రభోగపదసౌఖ్యమటన్నను వేరేయున్న దే? అను వాక్యము నాకు సరిపోయినది.

కాని యొకచింత! ఈయక్రమవిధికి ఆయమయొడంబడదు. నా పైగలగౌరవము, గురుబుద్ధి ఆయమను బంధించి, కట్టి, నోట మాటాడ కుండచేసి సరియనిపించుకొనును. నాకు బదులుచెప్పదు. కాని అదినాకు పాపముకదా.

పోనీ ప్రవాహములో దుమికితిని. వెనుకకు వచ్చుటకు వీలులేదు ముందుకే సాగవలెను.

ఏమి ఆముఖము, ఆచిరునవ్వు, ఆమందహాసము! నాలో లీనమై పోవుచున్నది. జగమంతయు సరోజామయమే! విశ్వరూపము సరోజా! యెన్నడు నేర్చితివి? నీతో మాటలాడు నిముషమే చాలదా? అబ్బా, యేలకలిగె నీపరిచయము? నేనేల పరిచయము పెంచితిని? పోనీ నా మనసు నేల హరించితివి? తగునా? సుకుమారీ! నీవు సౌందర్యఖనివి, సౌజన్యనిధివి. నీకై సర్వస్వమును పరిత్యజింపను-

వలదందువా? ఆమాట వినజాలను. ప్రపంచమున నాకేమి వెలుగు? దివాంధుడ నౌదును.

ఈపాటికి నా లేఖ నీకు చేరియుండునుకదా. దానిని చదివితివా? అర్థము గ్రహించితివా? గ్రహింపకలవుకాని నాపై కినుక వహించెదవా?

సరోజా! నిన్నాసించుట మిత్రద్రోహము. కాని 'నే' నను వ్యక్తి లేదే. దానిని నీవే గ్రహించితివి. ఏనాడు నీసహజమాధుర్యముగ 'ఏను స్వేచ్ఛావిహారిణి' అంటివో, ఆనాడే 'నే' నను శబ్దము పోయినది. అంతయునీవే. నేను నీలో ఐక్యమైతిని.

సరసాశ్లేషసుఖాదిప్రాప్తికి సరోజామంత్రరాజంబు న
త్తురలక్షల్ జపియింతు ప్రేమ మహిమాసంయోగసిద్ధుండనై
తరుణప్రాయము ధారవోసి రసవిద్యాధ్యానయోగంబునన్ .
స్మరదేవార్పితమంచు పూర్వపుణ్య ప్రాభవం బొప్పఁగన్.

(మౌనముగానుండ.)

ప్ర: పురోహితుడు.

పురో:—రాజారావుగారూ!

కవి:—ఎవరది? మీరా రండి, కూర్చోండి. నమస్కారములు.

పురో:—దీర్ఘఆయుష్యాదిరస్తు. ఏదో మీదర్శనముకై వచ్చితినీ. గుర్తుపట్టినారా? రామయ్యగారి తమ్ముండను. మీతండ్రికి మాఅన్నగారు వనస్పతులు.

కవి:—(నివ్వెరపడి) వనస్పతి యేమిటయ్యా, బృహస్పతి యనండీ.

పురో:—అదేగా నేననింది. పొరపాటున వినపడిందేమో లెండి. మీకు కన్యాదానము చేయవలెనని యున్నారు. కొందరు మీతో ఆ విషయమై మాటలాడవలెననియున్నా పురోహితుణ్ణిగా! అందువల్ల వినియోగించినారు.

కవి:—వినియోగించినారా? స్వామిజి! నేను వివాహము చేసికొనదలచుకొనలేదు. ఒకవేళ తలచిన తప్పక మీకు తెలియకచేసికొననులే.

పురో:—చిత్తము. విశ్వాసము అంతమాత్రమువుంటే చాలు. మీరు యువకులు. కాలమాసన్నమగుచున్నది. వివాహము చేసికొనక పోతే లోకులేమో యనుచుందురు. నవరసాలలో సారమైనది సంసారము. దానిఫలమే గృహస్థాశ్రమము. ఎన్నిరోజులు భీష్మీకరించుకొని బాలచర్యావస్థలో నుంటారు?

కవి:—స్వామి, వైదికులే భాష బాగా మాట్లాడుచున్నారు. శైలి!

పురో:—ఏమనుకొన్నారు. పంచహవ్యములు, పంచకవ్యాలు వర్లించి దొర్లించాను. భాగవతంలో పురజనోపాఖ్యానమో చేలోపాఖ్యానమో అర్థము టీకించవలెనంటే నన్నే యీపౌర్వీకులు వాహ్వానిస్తారు.

కవి:—వాహ్వానిస్తారు. ఇది యెక్కడి ప్రయోగమండి.

పురో:—ఇది తెలియదా. పెండ్లిపత్రికలలో కల్యాణమహోత్సవాహ్వానాపత్రికయని యంటారు. మీరు యింగ్లీషు చదువుకొన్న వారికి తెలుగులో అంతపాండ్యత్వము తక్కువ.

కవి:—స్వామీ! మిమ్మల నెవరిచ్చటికి పంపినారు.

పురో:—గంగాభాగీరథీసమానులైన నంజుండరావుగారూ.

కవి:—ఆగండి. మీ ప్రయోగములు అతిదైనవి. పురుషులకు గంగా భాగీరథీ యేమిటయ్యా, రాజేశ్రీ అనవలె.

పురో:—రాజారావు! అందుకే యింగ్లీషు చదువుకొన్నవారని మన్నిచేసికొంటిని. గంగ శాశ్వతమైనది. రాజ్యముకాదు. అందుకే ఆలోచించి గంగాభాగీరథీ యని ప్రయోగము చేస్తిని.

కవి:—స్వామీ! నాకు పనులు చాలాయున్నవి. తమరుదయచేయండి. ఈసారి మాట్లాడుదము.

పురో:—చిత్తము. మహామహావివాహైశ్వర్యంబులన్నీ ప్రాప్తిరస్తు.

తెరబడును.

---

# తృ తీ యాం క ము.

## స్థలము 2. వీధి.

[ప్ర: దేశానంద.]

ఘనతకుఁ లోకులు పెండ్లిపందిళ్ళులకుఁ కాఫీలకుఁ ధూమపా
నని కాయంబులకుఁ ప్రగల్భములకుఁ పార్టీలకుఁ కోర్టుకుఁ
ఘనతోద్యోగులమెప్పుకుఁ బిరుదుకుఁ నాట్యాలకుఁ మీామెల
క్షనుకుఁ ఖర్చగుద్రవ్య మార్తసమతిఁ గావంగ చేయందగుఁ.

నాజీవితమధ్యమున నింతవరకు అనేక మహిళామండలులను వ్రా రూర గట్టించి యున్నాను. బీద బాలురకు వసతులేర్పరిచితిని. నాపిత్రార్జితమంతయు వెచ్చించితిని. పేరుకై పాటుబడలేదు. కాని దేశమునకై పాటుపడితిని.

ఈరాయలసీమలో నొక మహిళామండలిని స్థాపించవలెను. పుర బాహ్యమునందు శ్రీరాముల దేవాలయమును యీ దుస్థితినుండి తప్పించి కట్టించవలయును. ఈనంజుండరావు గృహమునున్న రహస్య భేద మొనరించి యాకుటుంబమును కాపాడవలయును. నాజీవితములో దివ్యజ్ఞాన సమాజమునందు సాధ్యమైనంతపని చేయలేక పోయితిని. ఉపన్యాసము లిచ్చితిని. లాభింపలేకపోతిని. వేదాంత విషయములో కావలసినంత నేర్చుకొంటిని. ఆత్మార్పణ చేయలేకపోయితిని. బ్రహ్మ సమాజములో చేరితిని. అదియు తృప్తిగా నుండలేదు. కాంగ్రెసులో చేరితిని. అచ్చట లెక్కకుందగిన దేశసేవ చేయలేకపోయితిని.

కడకు యీ ఆశ్రమము—సన్యాసమూ కాదు.—సాంఘికమూ కాదు. విపరీతాశ్రమము గైకొంటిని. ఇందు ఆసేతుహిమాచలపర్యంతముగల సర్వపట్టణముల దర్శించి, అందు నాచేనైనకొలది సేవ భరత మాతార్పణముగావిడుచుట. ఇది నాకర్తవ్యము. నన్ను యోగియనుడు,

బైరాగియనుడు, Theosophist (థియాసఫిస్ట్) అనుడు. బ్రహ్మసమాజియనుడు. Congress man (కాంగ్రెస్ మేన్) యనుడు. యేమైనననుడు. అన్నియు చూచితిని. తుదకు నాకు నేనే అపూర్వముగా యీఆశ్రమము కల్పించుకొంటిని. నేను సాధునుగాను; ఆధునికులు నిరసింపరు. Theosophist (థియాసఫిస్ట్) కాను. హిందువులు నిరసింపరు. బ్రహ్మసామాజికుడగాను; సనాతనధర్ములు నిరసింపరు; congress man (కాంగ్రెస్ మేన్) కాను. Justice party (జస్టిస్ పార్టి) వారు నిరసింపరు. ఆత్మార్పణ—లోకసేవ, యీరెండే ముఖ్యధర్మములు.

ఈ గ్రామమున వకీలు నంజుండరావుగారి పరిచయము గల్గినది. వారు నాదేశసేవల కొంచెము వినినట్లున్నది. వారితో నింతకుముందే మహిళామండలిని గట్టించవలయునని నాయభిలాష నుడివితిని. వారు దానికొక విధమైన సమ్మతిని చూపిరి. కానిమ్ము. వారిని దర్శింతును. వారు నన్ను రమ్మనినకాల మగుచున్నది.

అనుబంధము.

నంజు:—స్వామిజీ! మీకై నేనే వచ్చుచుంటిని.

దేశా:—రావుగారూ! తమవంటి వుత్సాహపూరితులు వూరికొక్కరుండిన చాలు. తమవంటివారు తలచిన యేకార్యము కొనసాగదు.

నంజు:—మీకొక శుభవార్తను తెలుప నున్నాను. మొన్నటిదినం మీతో మాటలాడిన తరువాత దేశానందస్వామి వచ్చినాడని తెలిపి తమ అభిప్రాయములను తెలిపితిని. వారు చందాలు కూడా వేసినారు. నెలకొక యిరవై రూపాయలు వసూలు కానున్నది. దీనితో నొక గృహమును బాడిగెకు తీసికొని ప్రకృతం జరుపుచుండవచ్చును. తరువాత నాలోచింప వచ్చును.

దేశా:—ఆహా! నాయదృష్టం. నేతలచినకార్యము యింతసులభముగా నెరవేరుననుకొనలేదు. మీభార్య పద్మావతమ్మగారు ఆమండలికి అధ్యక్షురాలై సమాజమును జరుపవచ్చును.

సంజు:—కానీయండి. 5 రోజులలోపల మనమండలిలో ఆదిమసభ గావింపవచ్చును. నాకేమి పుత్రసంతానము లేదు. కొంతద్రవ్యము నేను శాశ్వత ధనముగా నిచ్చెదను.

దేశా:—వక్కీలుగారూ! ఈసహాయము చాలును. నేను దేశసేవకు నూతనమార్గము పట్టితిని. కాని తమవలె నింత ఆశ్చర్యకర ముగా సహాయము చేసినవారు లేరు.

సంజు:—మీరు అనవలసినంత సహాయమేమి? నిన్నటిదినం క్లబ్బులో సందర్భానుసారముగా వాడితిని. అందరు తథాస్తు అని వప్పు కొనిరి. అదియే సంగతి. కాని యీవూరిలో యెవడేమిచెప్పినా దానికి విపరీతార్థములు గల్పించుట అలవాటు కాని యెలానిన్న అందరూ వూరికె వున్నారో తెలియదండీ.

దేశా:—స్వామీ, నానివాసము యిచ్చట మండలిని స్థాపించువరకే. తదనంతరము మరియొకచోటికి చలనము. మీకు రామా రావును తెలియునా?

సంజు:—ఆహా! అతడు Insurance Co., Agent. (ఇన్షూర్యాన్సు కం పెనీ యేజంటు) మంచివాడు. ఈవూరిలో అందరికి కావలసిన వాడండి. అతడు వచ్చి మూడు సంవత్సరములేయైన అందరిలో మంచి యనిపించుకొన్నాడు. ఈవూరి Amature Association (అమెచ్యూర్ అసోసియేషన్) లో చేరి చాలా బాగా ఆక్టు చేసినాడు. అప్పటినుంచి యీవూరి చదువుకొన్నవారిలో గౌర వం సంపాదించు కొన్నాడు.

దేశా:—అతని స్వగ్రామమేదో?

సంజు:—నాతో చిత్తూరని తెలిపినాడు. కాని చిత్తూరునుండి నాస్నే హితుడొకడు వచ్చినప్పుడితనిని చూడలేదనియు చిత్తూరు వాస్తవ్యుడుకాడనియు చెప్పెను.

దేశా:—అతనిని మన మహిళామండలికి మేనేజర్‌గా వుంచుదమా.

నంజు:—స్వామిజీ! వలదు. వలదు. అతను కొంచెము త్రాగుబోతని నా యనుమానము. ఒకనాడు రాత్రి నాయింటిముందర పోవు చుండగా తెలిసినది. పిలిచితిని—వీలులేక వచ్చెను. అప్పుడు వాసనదాగునా? అప్పటినుండి నాకతనిపైన గౌరవము తగ్గినది. బ్రాహ్మణుడు—మావెలనాటి వాడండీ ఛీ. త్రాగుటయా?

దేశా:—అటులనా! చూచుటకు చాలా మంచివాడుగా నున్నాడే.

నంజు:—నాకేమో వానియందొకవిధమైన అసూయ. కాని వూరంతా వానిని మెచ్చుకుంటారు. వాని కాలం బాగున్నదండీ. అరవ్వా ళ్లతో అరవం. కన్నడంవాళ్లతో కన్నడం అన్నిభాషలు వస్తాయి ఆకుంకకు.

దేశా:—ఈ లోకంలో వృద్ధికివచ్చే వారికి కావలెనండి అన్నిభాషలు.

నంజు:—పోనీయ్యండి. వాని ప్రసంగము మనకెందుకు.

దేశా:—అలా అనకండి. అతని సంగతి నేను తెలిసికొనవలె? దాని వలన మీకును లాభము కలుగును.

నంజు:—అట్లయిన, వాని సంగతి మీరు వానివద్ద జవానుగానుండు సుభాన్‌ఖానును విచారించిన తెలుసును.

దేశా:—సరే. మీరు అతనిని మీగృహమునకు రానివ్వకుడు. సంగ తులు వేరుగానున్నవి. మీరింతవరకే వానిపైనున్న గౌరవమును వీడితిరని తెలిసికొంటిని. అది శుభము. రేపు వత్తును. మీరు మహిళామండలి విషయము మీ యింటిపనిగా తలచుకొన వలెను.

నంజు:—స్వామిజీ, ఒకమాట యీవూరిలో కొందరు శకునితుల్యులు గలరు. వారిని కొంచెమాశ్రయింపుడు. మీకార్యము తప్పక నెరవేరును.

నిష్క్రమింతురు.

తెరవ్రాలును.

# తృ తీ యాం క ము.

## స్థలము 3. ఇల్లు (డాక్టరుగారి గృహము).

[ ప్ర: సరోజాభాయి Gramophone పైన యేలవీతురమ్మ అను ప్లేటుపెట్టి ]

ఈశకుంతల విరహము నాకెంత అన్వయించుచున్నది. నామనసులో యేమో కొంచెము కలతగా వున్నది. ఏమో? ఎందుకో? తెలియదు. ఇంతకుముందు సగము వ్రాసిన వ్యాసములు పూర్తిచేయుటకు తోచుటలేదు. అన్నము రుచింపదు. కంటికి నిద్రపట్టదు. ఆతురతగానున్నది. కర్తవ్యము తెలియకున్నది.

నేనొంటరిగా మదరాసులో నున్నప్పు డొకనాడైనను యిట్టి యవస్తలోలేను. చదువుకాలములోకూడా లేని విపరీతభావములు నాలో జన్మించుచున్నవి. ఇదియంతయు కవికుమారుని స్నేహఫలమే.

ఆతడు నన్ను గౌరవించుచున్నాడు. అతనికి నేననిన చాలా వాత్సల్యత. నాతో మాటలాడునప్పుడు కొంచెము భయముగానుండేవాడు. ఇప్పుడెంతగా మారినాడు. నిశ్చలంగా సంభాషిస్తాడు. అతని గాంభీర్యము మెచ్చదగినదే. ఇతనివలె భాషాధికారము కలిగినవారిని నేను మదరాసులో నెవ్వరిని చూడలేదు. ఇతని సాహిత్యమే నన్ను ముగ్ధను గావించినది. నాభర్త శ్రీనివాసురావు మదరాసులో నున్నప్పు డుండిన ప్రగల్భము లప్పుడు నన్ను ఆశ్చర్యము నొందించు చుండెను. కాని కవికుమారునివద్ద శాంతము, మాదుర్యము కలవు. శ్రీనివాసరావు వద్ద నేను భయపడను. కాని కవికుమారునివద్ద భయము కలుగును. అతడు నన్ను జయించినాడు. బదులు వచించుటకు నోరాడదు. కాని అతనినిశ్చలత యద్వితీయము. అనవసరముగా మాట్లాడడు. హాస్యము చేయడు. తగినంత రీతిగా వర్తించుచు, గౌరవము చూపు చున్నాడు.

ఈలోపల అతనిని చూడకుండిన దిక్కు తెలియదు. ఏదో మిషపెట్టి పిలిపించుకొనుచుందును. అతని కవిత్వమునకు తగినరూప మాతని

యందు కలదు. ఈలోపల నన్నాతడు 'సరోజా' యని పిలుచునప్పు డెల్లను నామనసు వికసించును. దేహము పుల్కలారును. అతనిని విడిచి యుండుట కష్టసాధ్యమయినది.

స్త్రీలనిన సరిపడనివాడు. యిప్పుడొక రీతిగానున్నాడు. నాజీవి తాధ్యాయమున నతనిస్నేహ మొకవింతవృత్తముగా నున్నది. నాకు కవికుమారునికి కొన్నిగుణము లేకీభవించి యుండుటచేత మనసు విభ్రమమై యున్నది.

అతడు యువకుడు. నేను తరుణవయస్కురాలను. మాసంభాషణలు లోకమునకు వింతగానుండవా? లోకమునకై అతనికి దూరముగా నిల్తునా? లోకమున విద్యాప్రాభవము లేనివారగుటచే ప్రతికార్యమును స్త్రీ పురుషులలో విషమంబుగా భావింతురు. పాశ్చాత్య దేశమున నిట్టి భాదలులేవు. యువతీ యువకులకు యథేచ్ఛగా విహరించుటకీ భరతదేశమున తావేలేదు. స్త్రీలకు రసజ్ఞత్వము వుండకూడదు కాబోలు.

భ్రమలుదీరెడు నెయ్యంపు పలుకుకంటె
మనసురంజించుచూపుల మనివికంటె
పాళి, 'ఏర' 'పోరా' యను లీలకంటె
తరుణి కిలమీాద నేది ముదావహంబు.

మాటలచే, చూపులచే తప్పేమి? పరపురుషుని విద్యకుగాని, సాహసమునకుగాని మెచ్చి, మనసార మాటాడి, నెయ్యము బెంపుట సంసారికి అనుచితమా? ఇందుచే భర్తపై ప్రేమనశించునా?

భర్తతో భార్యకు కొంచెము బంధము. దినము మాటాడవలసిన భర్తతో శృంగారముగా, పలుకు చూపు కుదుకునా? అంతలో చెడిపోవునదేమి? అందు తప్పేమి? భర్తనుత్యజించిన, భర్తకుద్రోహము చేసిన తప్పు. ఇందులో తప్పులేదే.

కవికుమారుడు రసికుడు. కేవలము కామిగాడు. రసికత మనో సంబంధము. కామము శారీరకము. నేను స్వతంత్రను. నేనేల కవికుమారునితో మాటాడరాదు. మాస్నేహము నిజముగా అపూర్వమైనది. ఆతని విగ్రహము నాహృదయమందు నాటియున్నది. అతడు నాయాజ్ఞాబద్ధుడు. నామాట అతనికి తారకము. నేను......

కాదు నిజముగా అతడు ఆజ్ఞాపించుచున్నాడు. నేను స్వాతంత్ర్యము వీడుకొల్పితిని. అతడు నన్నాడించు చున్నాడు. అతని లేఖ ఆహా! ఎంత గంభీరమై నారికేళపాకముగా నున్నది. అని చదువును.

పంచయమింతయింతయయి పండి ఫలించి వికాసవంతమై
స్మరణకునిల్చి యీకవికుమారిని చూడ్కులనాశ్రయింపగా
కరుణయు కైతయుం చదువుగల్గు స్వతంత్రవు పట్టభద్రి వి
ట్లురిమురిపొందుచుంట తగునా సరసార్థికి బంధమున్న దే?

ఏమి? సరసార్థికి బంధమున్న దే? ఎక్కడిది పాపము నేను బద్ధననుకొంటివి కాబోలు. నేను సత్యముగ స్వతంత్రను. నాకు బంధములు లేవు. నీక చిరకాలంబున నాస్వతంత్రతచూపి నిన్నానందింప చేసెదను. ఏలకో నేను నీదాననైతిని. నాకై నీవు చింతింపవలయునా? నీకు నేను అర్థిని. నీవు నాకు అతిథివి. నాయందు నీవులీనమైతివని యెరుంగుదును. నీవంటి కవీంద్రుని సాంగత్యము సులభ్యమా? నిన్ను తప్పక కేళీవిశేషంబుల నోలలాడింపగలను. నా వ్యక్తి నెరుగవు. తలచిన స్వర్గమే భూతలమునందురాదా? మానసికయవస్థకు మేరగలదా? సరోజా సరసత్వమాసించిన నీకు స్వర్గసౌఖ్యముల నాసింపగలవా? ఈ స్నేహము కాదు యీభావము నాలోనుండి నీకును, నీలోనుండి నాకును ప్రవహించుచున్నది. ఈ స్నేహమే సుఖము. ఇదియే ఆనందము—ఆనందము...... (ఈజి ఛేర్ పైపడుకొని కనులుమూయును.)

ప్ర: శ్రీనివాసరావు.

శ్రీని:—సరోజా! ఈదినమేల చింతాగ్రస్తవై యున్నావు. ఏమి పాపము చేసితిని. నీకీచింతగలిగించుటకు?

సరో:—దిగ్గునలేచి, ఏమియులేదండీ. ఈనెలనుండి మాతండ్రిగారు వుత్తరము వ్రాయలేదు.

శ్రీని:—My dear, దీనికా, మనము మీతండ్రిగారివద్దకు పోవుదము లే నీవు చింతపడుట నాకు మహాకష్టము. నీకొక శుభవార్తను తెలిపెదలే. నీ ఫ్రండు దేవకి A. S. P. ని పెండ్లి చేసికొనింది. హిందూపేపరు చదువు?

సరో:—ఏదీ? అని చదివి, నేను పెండ్లిచేసుకొనను అని గట్టిపట్టుపట్టిన దేవకి మంచిచోటే తలపెట్టినదే.

శ్రీని:—ఇంకొక శుభవార్తకూడా తెలుపుచున్నాను విను. ఈవూరిలో దేశానందస్వామిగారు స్టార్టుచేసిన మహిళామండలికి నిన్ను శెక్రిటరిగా ఏర్పాటుచేసినారు. నీకు నోటీసువచ్చును. సంతోషించు.

సరో:—ఈ వూరిలో మహిళామండలి—ఇదంత ఆరంభ శూరత్వం పోనిస్తురూ. ఫండ్సు ఎవరిస్తారు?

శ్రీని:—నంజుండరావు వెయ్యి డొనేట్ చేసాడు. కవి వెయ్యి డొనేట్ చేస్తాడు. ఇంక విరాళాలు జాస్తీ అయినాయి. ముఖ్యంగా యీవూరి వర్తకులకు దీనిపైన కాంక్షపడ్డాది. అందుకే ఇంత త్వరలో అనుకూలించింది.

సరో:—మౌనం.

శ్రీని:—సరోజా, నీవేల మౌనంగా వున్నావు నీవిలావుండేది నాకిష్టము లేదు. రా. యిలారా (అని దెగ్గరతీసి) చెక్కిలిని ముద్దిడును. నీకై నేనేమిచేతును. ఏం కోపమా? లేకపోతే నవ్వుమరి? అలా భీకరంగా వుండకు?

సరో:—(నవ్వును.) అబ్బా మీరేనండి గెలిచారు లెండు.

శ్రీని:—ఆ. యింకభయంలేదు. రా. నీచేతులార కాఫీ పుచ్చుకొనిరా? త్రాగవలె.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

తెరపడును.

## తృ తీ యాం క ము.

### స్థలము 4. వీధి.

[ప్ర: రామారావు, సుభాన్‌ఖాన్.]

రామ:—అరే సుభాన్ ఇద్రావ్. నీవొక్కపని చేయవలెరా? నావద్ద ముత్యాలహార మున్నది. అమ్మాలరా?

సుభా:—క్యైకుజీ? మన అమ్మ వస్తుందంటిరే? ఆయమ వేసుకుంటుంది. కాలం బాగాలేదు. కోన్ కొంటారు?

రామ:—విను. ఇది తప్పక అమ్మవలె. ఈవూరిలో వద్దు. హైదరాబాదులో నమ్మవలె. నిన్ను పంపుతాను.

సుభా:—మాకీ పంపుతారు? బేరం గీరం అచ్చా తెల్యదు మారాజ్.

రామ:—ఇంత పనికిమాలిన వాడవయితే జీత మెలాయివ్వడం? కష్టం ఏమీలేదు. పో.

సుభా:—జీతం ఒకసంవత్సరానికి యివ్వవాలి. పోబుయిస్తే చూస్తాం.

రామ:—స్టుపిడ్. అంతా యిస్తానులే!

సుభా:—ఈవూరిలో అమ్మదాం. హైదరాబాదు కెందుకు? పెండ్లాం పిల్లలికి విడ్చిపోవాలి? మాది అమ్ముతాడు. ఏశెట్టి రామయ్య హంకు జోస్తీ!

రామ:—ఇక్కడ అవమానముకదూ? గౌరవంపోతే వస్తుందా? తెల్యని స్థలములో చెయ్యవలె.

సుభా:—క్యా! మావానిపేరు పెట్టుకొంటాడు. తప్పనై. సమయం వస్తే అల్లాబీ అమ్ముతాడ్.

రామ:—సుభాన్! నీకు తెలివిలేదు. చెప్పినట్లు వినవలె.

సుభా:—వింటాన్. చుప్కె ఘర్ చోడ్కే పోవాలంటే గుండెలు కొట్టుకుంటాయి.

రామ:—నీకు కష్టమునకు తగిన యినామిస్తాను. పని బాగాచెయ్యి?

సుభా:—ఇనాం! ఇనాందియాతో బహుతచ్ఛాకర్తుంలేవ్. ఇంతవరకు మాపనిలో తప్పుక్యాహై బోలో? మీరు అచ్ఛావాలా! మీరు దేనా. మేము ఖానా. సుభాఖానంటే యీవూరిలో నందరికీ పసంద్. మ్యాజస్ట్రీటుకేపాసు నౌకరీకరే. వకీలు నారాయణరావుకా, వీరణ్ణసెట్టికా పూచోమహారాజ్. ఏకీచ్ బాత్.

రామ:—నాకు తెలుసును. నీవు నిన్న మేజిస్ట్రీటు దొరవారికి పండ్లు యిచ్చి వచ్చినావా లేదా?

సుభా:—సోబ్ దియా మహారాజ్. వాండ్లు నిన్ను మెచ్చుకొన్నారు. సలాంబోలే.

రామ:—నిన్న జాబులు తెస్తానసిపోతివే? యెందుకురా తీసికొనిరాలేదు లేక తెచ్చి యెక్కడనైన పెట్టినావా?

సుభా:—నైజీ, నిన్న ఆ హారంకాభేటా పోస్టుమేన్ నేను మార్కెట్ నుండీ యింటికిపోతూవుంటి జాబులున్నాయి తీసికొనిపోఅన్నాడు నేను కాం వుంది యింటికిపోయి జల్దీవచ్చి అడిగితే, బద్మాష్ లేదుబోలే. నేను ఘుసాచేస్తినిమహారాజ్. వాడు తమాషాగా నవ్వుతాడు. వూరికె అంటిని అని చెప్పినాడు.

రామ:—పోనీ నీకు జాబులువచ్చినాయి అని యేవైనా చూపించెనా?

సుభా:—లేదు. చూపలేదు. చుప్కేబోలె.

రామ:—సరే. నీవు బోంచేసినావా? అయితే యిదుగో పది రూపాయలు తీసికో. యీపని యెవరితో చెప్పవద్దు. జాగ్రత. యీ రైలుకే వెళ్లు.

సుభా:—అచ్ఛా దేఖోమహారాజ్ సలాం. (అనిపోవును.)

రామారావు:—

ఇప్పటికదా స్వస్థుడనైతిని. నేను బెంగుళూరు డెకాయిటీ కేసులో సంపాదించిన సొత్తులన్నియు ఒక్కటొక్కటిగ నన్నియు నమ్మి వేసితిని. ఈ ముత్యాలహారము నేటితోసరి. ఇంక నావద్ద చోరీమాలు

శేషము లేదు. నాలుగుసంవత్సరములుగ, భద్రముగా సరిచేసుకొనుచు వచ్చితిని. ఇచ్చట మూడు సం॥రములనుండికాపురం. ఈనంది గ్రామమున నాపూర్వచరిత్ర నెవరు కనుగొన గలుగుదురు. పోలీసువారికి నేననిన అభిమానము. మేజిస్ట్రీటుకా నాసహ్లయిలచే కడుపునిండియున్నది. వకీళ్లకు నామాటలనిన అడ్డు లేదు.

చోరత్వముకూడ ఒకవిద్యయే. చతుషష్టి కళలో నొకటి. నే నెంత దరిద్రుడయ్యును ఎట్టి సౌఖ్యము లనుభవించుచున్నాను. యుక్తి కదా కలియుగ తారకము. ప్రపంచమా! రామారావును గుర్తెరుంగ గలవా?

ఈ గ్రామమున పాపము వకీలు నంజుండరావుగారి సొమ్ము మూడువేల వరకు తిని యున్నాను. రహస్యము తెలిసినదికాని సత్య మెంతవరకోగదా. ఆ యమను బాధించుచున్నాను. ద్రవ్యము లాగు చున్నాను. సంపాదన! ఏటి సంపాదన? ఈకాలమున ధనికులుగా నున్న వారందరు మోసగాండ్రే. ధర్మము నానాటికి మారుచున్నది. ఏదినము ధర్మము నాచరింపనివాడు పాపి. యమధర్మరాజు తన శాస్త్రమును పెనాల్ కోడ్‌ను మార్చినాడు. యెవడైనా జీవిపోయిన, నీవెన్ని కూనీలు చేసినావు? ఎన్నిచోరీలు చేసినావు అని అడుగును. మొదటి దానికి యస్ అంటే ఫస్టు క్లాస్ బంగ్లా. రెండోదానికంటే మేడయిల్లు. రెండు లేదంటే నరకమునకు పంపును. యేదో పిచ్చిధర్మములను చెప్పి ముక్కుబట్టుకొని మూలకూర్చొనువారిగతి యీలోకముల నేమి? ఎవ్వ రైనపల్కరింతురా? దబాయించి, మోసగించి, టకాయించువారలకు కలిపురుషుడు వున్నతపదవి నొసగుచున్నాడు.

నా తెలివితేటలన్నియు నేను యే బియ్యే చదువులయందు వుప యోగించియుండిన, యీపాటికి వుద్యోగము లేక అధికారుల యింటి గోడలమధ్యన నీడలలోపడియుందును. నేను యీరీతిగా నుపయోగించి నందులకు నాసౌఖ్యమునకు కొదువనా? నాయోగమునకు కొదువనా?

హిరణ్యకశ్యపుని వాక్యము సత్యం. ఇప్పుడు

సతులఁ బట్టుటయో? యమాయకుల సంసారంబులఁ గూల్చుటో?
మతవిధ్వంసము చేయుటో? ధనికులఁ బ్రమగ్గించి యార్జించుటో?
కృతకస్వార్థిచరించుటో? సుజనులఁ హింసించి శాసించుటో?
శృతిసంప్రోక్తము నేటిశూరులకుగాదే దర్కవాదంబునఁ.

కాని కడపటిపన్నగడ యొకటియున్నది. నేను వెలనాటిబ్రాహ్మణుడని వాడుకకదా. ఎటులనైన నంజుండరావు కుమార్తెను వివాహమాడుటకు యత్నింపవలెను. పద్మావతీభాయి నాచేతిలోనున్నది. ఆ యమ అమాయికురాలు. నాలోనున్న రహస్యమునకు భయపడుచున్నది. ఇదియే సమయం. దీనివలన నీమెతో నంజుండరావుకు యాభిప్రాయము మారునట్లుచేసి నాకు కమలను వివాహముకు విరెంపవలయును. అప్పుడు నాపని సరి.

అదిగో చెప్పిన ప్రకారము పద్మావతమ్మగారు వచ్చుచున్నది.

రామ:—ఏమమ్మా నీకై యెన్నిపనులు విడి వచ్చుచుండినను కొంచెమైన గౌరవములేక అతిచుల్కనగా చూచుచున్నావే? నీరహస్యము వెలిబుచ్చవలెను. ఇంక ఆగుటకు వీలులేదు.

పద్మా:—అయ్యా, యిదిగో ఒకయిన్నూరురూపాయలు తీసికొనివచ్చితిని. ఇంక కొంచెమేగా నీకివ్వవలసినది?

రామ:—నేను ద్రవ్యమున కాసించువాడ ననుకొంటివా? వినుము. నీవిచ్చినదంతయు నీకు వెనుక కిచ్చెదను. నేను చెప్పినకార్యము నెరవేర్పవయును. లేనిచో నీసంసారము నీవే పోగొట్టుకొనుకొందువు. తరువాత లాభములేదు.

పద్మా:—ఏమయ్యా, అది నీచకార్యమేదయినా కాదుగదా?

రామ:—ఏమియూ లేదు. నీకుమాత్రైను నాకిమ్మని నంజుండరావుకు బోధించి ఒప్పించవలయును.

పద్మా:—అయ్యా, యీపని నాతోనైనదికాదు. మావారికి వేరే అభిప్రాయములున్నవి. వారు వేరేచోట నిశ్చయింప దలచినారు.

రామ:—అటులైన నీగతి నీవే యనుభవింతువు. ఇదిగాక నీసొత్తులతో కూడా హాజరయి అంతయు తెలిపెదను. అప్పుడు నీగతి యేమగునో చూతము.

పద్మా:—ఏల? నొకప్రాణిని హింసింతువు. పోనిమ్ము. నాయెడతప్పేమి? అందు నేజేసిన దోషమేమి? అనుభవింపక తీరదు.

రామ:—(రూపాయలుతీసికొని) లాభములేదు. నీవు వచ్చేశనివారము లోపల యీపనినవరింపవలెను. లేనిచో...(అనివెడలిపోవును.)

పద్మా:—హా! దైవమా! నీవేగతి.

నిష్క్రమించును.

అవనిక దిగజారును.



శ్రీ.

# క్రొత్తనమూనా

## చతుర్థాంకము.

### స్థలము 1. ఉద్యానము.

[ప్ర: కవికుమార్, సరోజా.]

సరో:—ఈదినమేకదా సుదినము. యథేచ్ఛగా నీసాంగత్యము ననుభవించుట కవకాశమైనది!

కవి.—సుకుమారీ, నీకానుదినము? నాకు సుమీ అదృష్టదినము. నాలేఖకు నీవొసంగినయుత్తరమే నన్ను ధన్యునిగావించినది. నేడు పరమపుణ్యమూర్తి అయితిని.

అదిగో చల్లనిచందమామ మనలన్ హాస్యంబుగా జూచుచున్
హృదయైక్యం బొనగూర్చుచుండె నదిగో హేలావినోదంబుగా
మదిరాక్షీ! మలయానిలంబు కవనంబా? స్నేహసల్లాపమా?
హృదయాకర్షణయా? రసజ్ఞతయ? నీకేదానిపైయిష్టమో?

సరో:—కవికుమారా! యిచ్ఛయేనా భాగ్యము.

కామమన్ననో కవులపైకరుకు దనము
శాంతమన్ననో జవ్వన శత్రువగును
కలిగె నేకాంత మికమీద కవికుమార
నిగ్రహంబున కెక్కడి నేవుకలదు.

కవి:—ఏన సరోజా! మనసారగ్రహించితివా యీహృదయమును?

సరో:— రాజా! చాలింపుము నీ ప్రసంగములు. బహిరంగముగా నాతో బల్కించుటకు యత్నించుచుంటివా?

కవి:—ఐన బహిరంగముకాక గోప్యముగా పల్కుచుండితివా? తెలిసికొనక పోయితిని నీభావముల.

సరో:— తెలిసికొనలేవు. పాపము! ఒక్క బాణమున నన్ను పటాపంచలు చేసి, నన్ను వశ్యను గావించుకొంటి వే!

కవి:—సరోజా! అట్లనకుము. నీవు నావశ్యవుకావు. నీవుస్వతంత్రవు ఒకరివశ్యవుకావు. నీలో వెలుంగు అఖండమైన స్వతంత్రజ్యోతి. నితరుల నబలల గావించును. నీవు మార్గదర్శివి. నీకు నేను ఛాయను. . . .

సరో:—నీకవిత్వము నాయెడ వలదు. ఏల వివాహ మింతవరకు చేసికొనకుంటివి?

కవి:—నావివాహ ప్రశంస నీకెందులకు? నాతీర్మానమిట్టుల నుండుటయే ఏల అట్లడిగితివి?

సరో:—నీకు వివాహము కాకుండిన మనస్నేహమున కంతరాయములు గల్గునని.

కవి:—నా వివాహమున కర్థములేదు. నేను జీవయాత్ర గడపుటకు నాకొక్క స్త్రీసహవాసము నక్కరలేదు. ఒకస్త్రీ నాహృదయమున ఆక్రమప్రవేశము గావించినది. ఆయమకే అది అర్పించియుంటిని. మరల మరల మార్చువాడనుగాను.

సరో:—ఆహా! ఆస్త్రీ పరాంగనయే? నీకేటి సౌఖ్యము కలుగును? ఆయమ కేమిసౌఖ్యము?

కవి:—పరాంగనయైన, నాహృదయమున చొరదు. హృదయస్థమైన తరువాత పరాంగనకాదు. నిజాంగనయే!

సరో:—అటులైన, నీతో సంసారము చేయవలయునా?

కవి:—సరోజా! హృదయార్పణకు బాహ్యసంసారమా గుర్తు. భావములుకావా?

సరో:—పోనిండు. (అని చేతులుబట్టుకొని) ఏల? నాపై యింత భ్రమ?

కవి:—ఏల? తారకలు వెలుగునేల? నదులు ప్రవహించునేల? పుష్పములు సౌరభము వెదజల్లునేల? ఏల సహజము ప్రకృతి?—

సరో:—ఏమీ, యితని వుద్రేకము. కవికుమారా! పురుషుల హృదయములు చంచలములుకదా? కామము వారి సహజము. నీవీ మాటలను కామలోలితచే బల్కుచుంటివి!

కవి:—సరోజ... ఇది కామముగాదు. కామము ప్రేమకు నొక అంగము. నిర్మలప్రేమ—నిశ్చలప్రేమ. ఇట్టి ప్రేమను వేరుగా భావింతువా? (అని కరమందుకొనును.)

సరో:—కవికుమారా! కాంతలకు రసికులగు పురుషుల సాంగత్యమున కంటె లోకము నేదికావలయు? ధనధాన్యములచే, కనకాంబరములచే, అష్టైశ్వర్యములచే కరుగని కాంతల హృదయము రసికుల సంభాషణచే కరుగుచుండును. కవీ, నాపై నీకుండు ప్రేమకంటే, నీపై నాకు వేయిమడుగులు కలదు. నేను నీదాననైతిని. వివాహము నాపై యొకభాధ్యతి నిల్పినది. కాని నాహక్కును సడలింపదు. నీతో ఆనందించుట నాహక్కు. నేను నీదానను. మనప్రేమ అనంతమగుగాక!

కవి: —నీవు నాకిప్పుడు ఆనందమయివైతివి. మనసార నిన్ను ప్రేమించి నందులకు ఫలము నేడుగదా. (అని కౌగిలింపదలప).

సరో:—రాజా! వలదు, వలదు. ప్రేమ కిదియా ఫలము? నిలు. నిలు. ప్రేమ......

కవి:—నీ 'ప్రేమ' యను రెండక్షరములకు నీవు రెండురోజులు చెప్పగలవు. అనుభవదూరమైన ప్రేమ ప్రేమకాదు. (భుజముపై చేయివేసి) ఇదుగో కవికి, కవిత్వము. (అరచేతినిముద్దగొనును)

సరో:—రాజా! నీవు మహిళామండలికి వేయి రూప్యము లొసగితివట వింటిని.

కవి:—సరోజా! ఏల ప్రసంగము మరల్చుచుంటివి. నీకిష్టము లేనియెడల శెలవా! (అని లేచును.)

సరో:—'చెయ్యిపట్టుకొని నిలిపి' నవ్వుచు 'కవిత్వము' నకు గణ నిబంధనలున్నవి. కూర్చో, మహిళామండలిని కొంచెము శ్రద్ధగా చూడవలెను.

కవి:—నాకు నీవు చెప్పవలెనా. నీవెన్నడు సెక్రిటరి వైతివో, ఆనాడే దాని అభివృద్ధికి కంకణము గట్టుకొంటిని.

సరో:—పోనీ. అచ్చట 'నా' 'నీ' రెండు తటస్థించెనా?

కవి:—ఈప్రపంచమున నీవేది చెసినను, అందు నేనుండక తప్పదు.

సరో:—రాజా! నిన్ను తప్పించుకొనుటకు నాకు మార్గము లేదా?

కవి:—ఏల, లేదు. నేను నీలోననేయున్నాను.

సరో:—కవీ! ఇదిగో నీకవిత్వమున కవకాశము (అనికొన్నిపుష్పములు చల్లి) నీకీపుష్పదాన మెంత మనోహరము.

ఈసుమరాజ మీవిక గ్రహింపుము నాహృదయానురాగ సం
భాసితసౌరభాన్వితము భావవిహారవిలాససంతతా
భ్యాసివి సంతతంబు ప్రణయంబున దీనిని వాడకుండగా
జేసి స్మరింపగావలయు శ్రీమతివైన సరోజ నెప్పుడున్.

కవి:—సరోజా ధన్యుడ......నేను నీ......

(సరోజా.)

కవి:—ఎవరది? సరోజా!

సరో:—నంజుండరావు కొమార్తె కమల ధ్వనిగా నున్నట్లున్నది.

కవి:—ఇప్పుడేల వచ్చినది. మన ప్రేమ కీకమలభంగకారిగానున్నదే.

సరో:—కానిమ్ము. ఎందులకు వచ్చినది.

ప్ర: కమల.

కమ:—సరోజా! నేను మన మండలివారందరికి నీవిచ్చిన నోటీసు అందించితిని. కొందరు రేపుదయముననే మీటింగు కావలెనని,

మరునాడు వలదని చెప్పుటచే, ఆసంగతి మీకు చెప్పుటకై మాయమ్మ పంపినది.

కవి:—(కమలను చూచును.)

కమ:—(తిలకించి తలవంచును.)

సరో:—అటులనా! కూర్చో చెపుతా.

కవి:—శలవా? (యనిపోవును.)

కమ:—మాయమ్మ రేపే సమావేశము కావలయుననియున్నది. దేశానందస్వామి మాయింటిలోనుండి నన్నిప్పుడు పంపినారు.

సరో:—సరే. మండలి విషయమునకే సహాయము చేయుమని రాజారావును ప్రార్థించుచుంటిని. అతనితో ఈవిషయమునే మాట్లాడుచుంటిని. సరే. పోదాము రా. సరే. రేపే మీటింగుచేతము. కమలా నీవివాహము నిశ్చయమైనదా?

కమ:—నాకు తెలియదు.

సరో:—సోదరీ! యింత సిగ్గేల. కవికుమారుని కిచ్చుటకు నిశ్చయించినారటగా? పోనీ. మీయమ్మ నడిగి తెలుసుకొందును లెమ్ము.

నిష్క్రమింతురు.

తెరవ్రాలును.

## చతుర్థాంకము.

### స్థలము 2. ఇల్లు (శ్రీనివాసరావు గృహము.)

[ప్ర: శ్రీనివాసరావు, సుబ్బన్న.]

శ్రీని:—సుబ్బన్నా, యెక్కడిదిరా యీచేతిరుమాలా?
సుబ్బ:—మన యింటివెనుకనుండు తోటలో నుంచినది బాబు.
శ్రీని:—అక్కడ యెట్లున్నది? నిన్న సాయంకాలము యెవరు తోటలోనికి పోయినారురా?
సుబ్బ:—నాకు తెల్యదుబాబూ. రాత్రి పది ఘంటలప్పుడు ఆ క...వి గారు. తరువాత కమలమ్మ మన అమ్మయ్యా బయట వచ్చిరి. అంతేబాబూ నాకు తెల్యదు.
శ్రీని:—కవి యెప్పుడు వచ్చినాడు?
సుబ్బ:—నాకు తెల్యదండీ.
శ్రీని:—సరే. నీవు పో. (పోవును.)

అక్కటా! ఆసించి, యీ చదువుకొనినవాండ్లను చేసికొంటే యీకష్టమా! కష్టపడి బంధువులతో విరోధించి, సాహసించి, యీ సరోజకై నేను పడినపాట్లన్నియూ నింతగామారినవా? నాకు ద్రోహము చేసి, నాప్రేమను త్రెంపి, నన్ను విసర్జించి, నాజీవితమును పటాపంచలు చేయనెంచినదిగా? ఆహా! యిప్పుడేమి చేయవలెను?

చదువుకొనిన బుద్ధిరావలదా? ఈపాడు యింగ్లీషుచదువు వున్న మతిపోగొట్టును. విహారాలు, విలాసాలు కావలెనంటారు. సమకూర్చక పోతే తప్పు. సమకూర్చిన విషమించును.

సరోజ యొక వున్నాది. ఏదో మాట్లాడుకొనుచుండ కూడదా? మహిళామండలి విషయము కాగూడదా? ఆయమకు నాపై ప్రేమ మిక్కిలి. స్వతంత్రిణి గాని స్వైరిణిగాదు. గంభీర కాని కుటిలగాదు. దుర్జయ కాని ధృష్టగాదు.

ఐనను లోకమున నిందపాలగునట్లు చరింపనేల? తప్పని గ్రహింప కూడదా.

నేను కొంచెము స్వతంత్ర మొసగితిని. అది తప్పా నాయందు న్నది. నేనిప్పు డీమెకు తగిన బుద్ధి చెప్పెదను? సరోజా చాలా రోషము కలది. మాటచే గ్రహించుకొనును. ఆయమను నొప్పింపరాదు.

నొప్పించి నేను చేయునదేమి? స్త్రీలహృదయములు చంచలములు. పురుషులను నమ్మరాదు. ఇదిగో హృదయమా! సరోజను నిందించుచున్నావు. తప్పక ఆయమయందు దోషములేదు. కొంచెము మితిమీరి విపరీత ప్రసంగముల మాటలాడుచుండవచ్చును.

అయిన ఆఫీసురూములో కూర్చొనక తోటలోని కేల పోవలయును...? ఇది యొకతప్పా? కమలకూడా అచ్చటనుండినట్లు సుబ్బన్న చెప్పుచున్నాడే? గనుక నా అనుమానము పోగొట్టుచున్నది. ఏమైనా కొంచెము మందలించి చూచెదను. (అని పేపరు చదువుచుండును.)

ప్ర: సరోజ.

సరో:—అబ్బా కాఫీకైనను సరిగా పేపరుపట్టుకుంటారేమిటి? రండి కాఫీకి!

శ్రీని:—తమరు స్వీకరించండి చాలు!

సరో:—మీకంటే నేను ముందు తీసికొనేదానినైతే మీకు చెప్పకుండానే ముందే తీసికొనియుందును.

శ్రీని:—చాలు. నీధర్మము. నీపాతివ్రత్యము. వెళ్లు.

సరో:—నవ్వుచూ, ఏమి యీదినం ఒకదమ్మిడీకూడా డిస్పెన్సరీలో ఆదాయంలేదాయే? మీరు నామీద మండిపడుచున్నారు.

శ్రీని:—Shut up. (షటప్) నీమాటలు జాస్తీవున్నాయి. నీవింత కులటవనుకొన లేదు.

సరో:—మండిపడుచు, మీరనుమాటలకు మీకర్థము తెలిసినట్లులేదు. పూరికే అనకండి.

శ్రీని:—ఏమి తెలియనట్లు మాటాడి ఎవరిని మోసగింతువు? యీచేతి రుమాల తోటలోకి యెట్లు వచ్చినది?

సరో:—(చూచి) ఇది కవికుమారునిది. అతను వేసియుండవచ్చును.

శ్రీని:—సరోజా నీవబద్ధము లాడినను, సందర్భము లబద్ధములాడవు. నీకాతనితో రాత్రి అకాలమువరకూ పనియేమి?

సరో:—అయిన యిదియా మీ అనుమాన కారణము?

శ్రీని:—ఇక మాట్లాడవద్దు. నేటితో సరి. నేను నిన్ను వివాహమాడి నందులకు నన్ను నేను దూషించుకొనుచున్నాను.

సరో:—(మౌనము.)

శ్రీని:—నిన్ను చూచి మోసపోయితిని. నీవిట్టి ద్రోహివనుకొనలేదు.

సరో:—ఆగండి. మీరు వృథా నన్ను మాటలనుట మంచిదిగాదు. మీకు నిదానములేదు. నాపైన నమ్మకము లేదు. మీతొందరకు మీరే పశ్చాత్తాపపడుదురు. పదిరోజుల లోపల నీయనుమాన నివృత్తి చేసెదను. లేనిచో నాప్రాణములనే విసర్జించెదను. (పోవును.)

శ్రీని:—నేను తొందరపడితిని. ఈయమ తన సహజగాంభీర్యము నిట్టి యవస్థలోకూడా వదలదే? ఆస్వాతంత్రశక్తి నశించదే? ఇప్పటికీ నన్నే చీవాట్లుబెట్టినది. ఇది నిర్దోషి. సత్యము. కాని భర్త హృదయ మంత సులభముగా తృప్తిపడును. నేను యీమాట అనకనే పరిశీలించి యుండవలసినది. అప్పుడు తెలిసికొనిన తరువాత ఇట్లో, అట్లో ఆలోచింపవలెను. కాని, త్వరపడి సరోజ హృదయము నొప్పి గలిగించితిని. కాని ఆవేశము పట్టలేక పోయితిని. ఏమో అడిగితిని. ఎంత వెఱ్ఱిని ఈ యనుమానపిశాచమేల దాపరించినది? మరచిపోయెదను. (సిగరెటు కాల్చును.)

తెరబడును.



# చతుర్థాంకము.

## స్థలము 3. బాహ్యప్రదేశము.

[ప్ర: సరోజా.]

అక్కటా! హృదయమా! ఏల పగిలిపోవు——? కులటయని నా భర్తతో ననిపించుకొంటివే! ఎంతమాట! సాధువు! నామాటలకు యెదురాడడు! అట్టి నాభర్త నన్నిమాటయనుటకు తనమనసెంత నొప్పి పడియెనోగదా. నన్నిననమాటకు నాకు కలుగునొప్పికంటే, అతని మన సున నొప్పి కలిగియుండవలెను. అక్కటా! భర్తమనసు నొప్పించుట భార్యకు ధర్మమా?

ఇదంతయు ఆకవికుమారుని మాహాత్మ్యమేకదా! నేను అవకాశ మియ్యనిది అతనేమిచేయును! అబ్బా! యీపిచ్చి. యీకవిత్వముపిచ్చి నాకేల? ఇందరు యింగ్లీషు చదువుకొనినవా రున్నారే? వారికిలేనిపిచ్చి నాకేల? కలిగిన నేనేల యింత శ్రద్ధగా బూనితిని? నేనేల ఆకవికుమా రునికేల చూపవలెను? చూపినను మాప్రసంగములు అధికప్రసంగము లుగా మ్మారనేల? అతనికి నాపై యేల యీప్రేమ కలుగవలయును? నేను దానిని ఖండింపక లేనిపోని యీనవీనపద్ధతిచే నేల సమర్థించుకొం టిని? యీనవీనపద్ధతి__నవీనానంద మెట్లు మారినది? కడకు నాపై నాభర్త యనుమానించు చున్నాడే!

రామచంద్రా! యేల బేలనైతిని. నేను భారతదేశమునందుండియు యిచ్చటి సాంప్రదాయములను మరచి పాశ్చాత్యవిద్యాప్రాభవముచే వింతత్రోవలబట్టి వింతభావములను గల్పించుకొని, లోకహాస్యమునకు ఆధారమైతినా?

ఈదేశముననున్న సాధ్వీమణులకంటె నాకెక్కువవిద్య కలదా? పూరికే భ్రమసి మిట్టిపడి, పిచ్చి ఆలోచనలపాలయి నాకే నేను ముప్పు తెచ్చుకొనుచుంటిని. ఇందెవరిది తప్పు?

హృదయమా! నీవుభర్తకు ద్రోహము తలచితివా—? లేదే! అట్టినీపై యేలనింద? అక్కటా! నాకు కవికుమారునిపైగల స్నేహము. అది అతని రసజ్ఞతకు మెప్పు. అభినందనము కొంచెము పెరిగినను అది ప్రేమగా పరిణమింపలేదే? నేను పాశ్చాత్యరీతిగా మాటలచే కొంత సరసముగా ప్రొద్దుపుచ్చుకొందుననుకొనిన నాతీర్మానము తప్పు.

స్త్రీలు పురుషులు కలిసిన—ఏకాంతముగనున్నప్పుడు ఇంతవరకు పరిచయము—ఇంతవరకు స్నేహము—ఇంతవరకు ప్రేమ అను విభజన పొరపాటు. ఎంతస్నేహముగా కలిసి యెంతస్నేహముగా నుందమనుకొనిన అది హద్దుమీరును. మీరినదని వీరికి తెలియదు. ప్రవాహములో పడినరీతిగా యిదమిత్థమని తెలియుట అసాధ్యము. పాశ్చాత్యులవిధి—వాదించుటకు బాగుండును. అనుభవములో రసాభాసముగా నుండును. ఏకాంతమున పరిచయము స్నేహమై, స్నేహమే మోహమై అన్ని క్షణములో మారిపోగలవు. నాయభిప్రాయము పొరపాటు.

అందుకే మనవారు ఏకాంతమునలదనినారు. పోనీ లోకుల మాట జ్ఞప్తికివచ్చినదా? దేశకాలముల దలంపక నావున్మాదభావములతో పరుగెత్తుట చేతనే యీయవస్థ నాకు కలిగినది.

ఇందు మునిగినదేమి? ఇప్పటికైన తెలుసుకొంటిని. ముందంజ వేయకముందే మొదటికిమోసము కానున్నది. ఇది మంచిదియే.

నా కెవరేమనిననేమి? నామనసు నిష్కళంకమైనది. నాయందు తప్పు లేకపోయిన నాకది ఆనందము. నాకు నేను సత్యముగ ధర్మముగ చరించిన తప్పు లేదు.

కవికుమారుడు నాకు మోస మొనరించెనా? పాప మొకని నేల యనవలెను? అతనికి 'సరోజా' యనుమంటిని. ప్రబంధములలోని శృంగార విషయము లడిగితిని. లేఖకు బదులువ్రాసి యేకాంతముగా మాటలాడితిని. వీటినన్నిటిని చూచి, యివి ప్రేమలక్షణము లనుకొని యుండును.

నేను కవికుమారుడు ఏకాంతముగా మాటలాడుటచూచి లోకులును, చేతిరుమాలనుచూచి భర్తయును, ప్రేమానుబంధ మనుకొనుచున్నారు. ఇందరిని మోసగించితిని. కడకు నేనే మోసగించుకొనుచుంటిని.

నేను తలచునట్లు పాశ్చాత్యవిధిగా తలచు వారొకరును లేరే! అందరునూ విపరీతార్థమే తీయుచున్నారే!

ఇంతకును 'చేతిరుమాల' ఇది నాచర్యలలో మార్పు గలిగించుచున్నది. ఈచేతిరుమాల నాభర్తకు దొరికి నన్ననుమానింపకున్న నేను నానవీనానందమున వుప్పొంగి కడకు నన్ను మోసగించుకొని కవికుమారుని ప్రేమలలో చిక్కి బంధింపబడి, అవస్థపడుచుండి, లోకము వ్రేలి చూపులకు నిల్వామై యుందును.

దైవమా! ప్రథమచుంబనము దంతభగ్నము. బాగుగనైనది. నేను సనాతన ధర్మావలంబిని అని తలచుకొనుచుందునే! యిట్టి విపరీతము లేలచేసితిని? 'కమలా' ఆహా! యెట్టి తరుణమున సాక్షాత్కరించినది. లేనిచో నిరువురు మగ్నులమై ప్రవాహమున కెక్కడికిపోయి యుందుమో కదా!

ఇప్పటికి బుద్ధి వచ్చినది. కనులార చూచితిని. నవలలో చదివి, నాయకీ నాయకులరీతిగా వర్తింపదలచుట పట్టి పిచ్చి. ఆగ్రంథకర్తలు నావంటివారిని మోసగించుటకే వ్రాసియున్నారు. చదువు మెదడుకు, సత్యపు మెదడుకు చాలా భేదమున్నది. చదివి చదివినట్లు నటింపవలెననుకొని ప్రపంచానుభవము లేక కాలుజారిపడువా రెందరో కలరు.

నా స్వతంత్రము— నా బి...య్యే—నా కవిత—నా తెలివితేటలు—నాభర్తను నమ్మింపగలిగినవా? భర్తప్రేమయుండిన యివన్నియు లెక్కమీద సున్న లెక్కనట్లుండును. అది లేనిచో యివన్నియు నిరర్థకములు.

ఇక నాగుణములకు కొన్నిటికిని స్వస్తి చెప్పెదను. సాధారణ ముగ గృహిణివలెనుండి యీషోకులను సాగనంపెదను. మాయింటిలో నున్న వంటవానికిని, నాతుంటరి మాటలకును స్వస్తి చెప్పెదను. నా బాహిమియన్ గుణములకు స్వస్తి చెప్పెదను.

నాభర్తకు నేను వేరుగా రుజువుచేయుట అనవసరము. నాగుణ ములచూచి అతనే మార్చుకొన గలడు. అతనికి నామార్పుతో సహా యభిప్రాయము మారును.

కడకు నాతండ్రికి వేలరూప్యములు ఖర్చుపెట్టించి, నాయవ్వన మును నిరర్థకముగా కొంతకాలము చేసి చదివినందుకు నేర్చుకొనిన ఫలమిది! మాభావములు వితండములై ప్రపంచ విరుద్ధములై హాస్యా స్పదముగా పరిణమించుచున్నవి. అక్కడ, ఆభావములచూచిమెచ్చి తల యూచువారే ఇక్కడ ఏవగించుకొనుచున్నారే! గనుక బుద్ధి వచ్చినది.

అయితే కవికుమారునికి నాకుగల స్నేహమంతటితో అంతరింప వలసినదేనా? అది ప్రపంచములో నిరసింప వలసినదేనా? ఆ ప్రేమకు సనాతనధర్మమున తావులేదా? ఏల సోదరునిగా భావింప కూడదు? ఆ! మారినది. కవితాగర్భమున నిరువురు జన్మించిరి అనుకొందును. అతడు కవికుమారుడు. నేను కవికుమారిని. మా ప్రేమ సోదరప్రేమగా వృద్ధిబొందును గాక.

నాభర్త యనుమానము తీర్పవలదా? ఎప్పుడు కవికుమారునిపై ప్రేమ సోదరప్రేమయగునో అప్పుడే నాభర్త అనుమానమునకు ప్రాణ ములేదు. నాకు దోషములేదు.

ప్రకృతము నేను యీనవీనరీతిని వీడి మారిపోయితిని. నన్ను చూచువారికి నేను యింగ్లీషు చదువుకొనినదానివలె నగుపించకుందును. నాచదువు, నాషోకులకుగాను నాకు తెలివి ప్రపంచజ్ఞాన మొసగుట కుప యోగింతును. బుద్ధి వచ్చినది. నిష్క్రమించును.

తెరవాలును.

## చతుర్థాంకము.

### స్థలము 4. మహిళామండలి.

[ప్ర: పద్మావతి, దేశానంద.]

పద్మా:—స్వామీ! యీదేశమున అన్యజాతివివాహములు దోషపూరితములా?

దేశా:—అన్యజాతి వివాహములు అనులోమ వివాహములు శాస్త్రీయములే. యీచర్చ తమ కేల?

పద్మా:—అడుగుచుంటిని. తనకంటే హీనజాతి స్త్రీని వివాహమాడిన బ్రాహ్మణునకగు ప్రాయశ్చిత్తమేది?

దేశా:—ప్రాయశ్చిత్తమే లేదు. అందు తప్పేమి? హీనజాతి స్త్రీయని యితరులకు తెలిసిన ధనవంతుడైన ప్రాయశ్చిత్త మందురు. లేనిచో వెలి వెట్టుదురు. శాస్త్రములనుండి యని ధనాశాపూరితులగు పౌరోహితుల యుక్తులు. బెంగుళూరు కందుకూరు రామయ్యగారి కుమార్తెవగు నీకు యీ అనుమానము లేల?

పద్మా:—కాదండీ? నేను కంటోనుమెంటులోనున్న వాణాల సుబ్బయ్యగారి కుమార్తెను.

దేశా:—అందుకే వట్టిభ్రాంతనై రామారావుచుట్టు తిరుగుచూ ద్రవ్యము ఖర్చు బెట్టుచున్నావు.

పద్మా:—స్వామీ—ఏమి?

దేశా:—అమ్మా! కూర్చొనుము. నాకంతయు తెలియును. నీవు రామయ్యగారి కుమార్తెవు. నీకు బాల్యముననే తలిదండ్రులు చనిపోవడంచేత సుబ్బయ్య పెంచుచూవచ్చినాడు. సుబ్బయ్యగారు నిన్ను నంజుండరావుగారికి యిచ్చి పెండ్లిచేసిన తరువాత బీదవాడై యొకపిల్లనుబెంచి గౌరీబిదనూరు సుబ్బారావు కిచ్చినాడు. ఆయమ దాసీపుత్రిక. ఆయమకు సంబంధించిన జాబును నీకు

చదివి ఆ రామారావు ద్రవ్యము నపహరించుచున్నాడు. మీ మేనత్త, వాణాల సుబ్బయ్యకు వ్రాసిన జాబులుకూడా తెప్పించి యుంచినాను.

పద్మా:—ఆశ్చర్యముగా నున్నదే? స్వామి ఎందు కింత శ్రమ తీసి కొన్నారు? మీకీ జాబు లెట్లు దొరికినవి?

దేశా:—అమ్మాయీ! మొదట నేను బెంగుళూరులో కంటోన్మెం టులో గుమాస్తాగా యుంటిని. ఇక్కడ నెల క్రిందట మీరు రాముల దేవాలయమువద్ద రామారావుకు హారము యిచ్చి నప్పటినుండి యీ సమస్యను తీర్చవలయు ననుకొని యుంటిని. నిన్నటిదినం నాకు జాబులుకూడా చేరినవి. నీకేమి భయము వలదు. అన్నిటిని నేను సవరింతును.

పద్మా:—స్వామీ! యీజాబుల నమ్మువా రెవరు? వాడు అందరికి కావలసినవాడుగా నున్నాడు. వాని మాట కొందరయినా నమ్మ దురా? నాకుమా త్తైకు వివాహ మెట్లగునాయని చింత. వానిని యెటులయినా యీవూరినుండి తొలగదీసిన చాలును.

దేశా:—అమ్మా! భయపడవలదు. యీవూరినుండి తొలగించి కారాగృహమునకే పంపెదను. వాని పూర్వచరిత్ర నీవెరుగవు?

పద్మా:—వాడు నన్ను నాకుమా త్తై నిప్పించుమని అడిగినాడు స్వామీ!

దేశా:—తెలుసును. మీరూరకుండుడు. మీమనస్సున చింతపడవలదు. మీకుమా త్తైను మీభర్త కవికుమారున కీయదలంచినాడు.

పద్మా:—స్వామీ! యీవిషయ మెవ్వరికిని తెలుపవలదు. కాలమెట్లున్నదో?

తెరవ్రాలును.

— ❦ —

శ్రీ.

# క్రొత్త నవాబ్

## పంచమాంకము.

### స్థలము 1. వీధి.

ప్ర: దేశానంద, సుభాన్‌ఖాన్.

దేశా:—సుభాన్‌ఖాన్, యిదిగో నిన్న మామండలిలో నీళ్లు చల్లినందుకు రూపాయి.

సుభా:—సలాం. మాఅయ్యకు యెంత బడా కాం చేసిన యివ్వాడుజీ? యెప్పుడు సొమ్ము డబ్బా వుంటూంది. ఇచ్చేవాడూ నై.

దేశా:—మొన్న యెందుకు హైదారాబాద్ పోయినావు? నీపనా? మీఅయ్యపనా?

సుభా:—మాకీ యేంపని వుంటాది? అయ్య చెప్పినాడు.

దేశా:—పోనీ. యేమిపనిచేసి వచ్చినావు?

సుభా:—అయినా నై బోల్నా. ఆయన వద్దూ చెప్పినాడు. రహస్యం వుంచకపోతే ఏమీధర్మం మహారాజ్.

దేశా:—పోనీ. యెవరికి అమ్మితివి?

సుభా:—ఏమి అమ్మడం? మాకీ కూచ్బీ తెల్యదుజీ. (నవ్వును.)

దేశా:—దాచవద్దు. అది ముత్యాలహారము. నీవు అమ్మవచ్చినావు. చెప్పకపోతే నిన్ను పోలీసువారికి పట్టిస్తాను. జాగ్రత.

సుభా:—మీకీ తెల్సింది. బడాచోర్ కైసామాలుం నాయింటీ మే చెప్పలేదు బా.

దేశా:—అది దొంగసొత్తు.

సుభా:—అరే అల్లా! నాకు తెల్యదుజీ. మైలమ్మిందినిజం. యెట్లయినా నిజంచెప్పి తప్పించుకోవలె. నైజాం యెకాంబర్ చెట్టికి దియా దోసాకూ. కేసు హమార్ పాసు నకో మహారాజ్.

దేశా:—నీవంతయు పోలీసు ఇన్స్పెక్టరుగారికి చెప్పవలె? లేకపోతే నీపైన కేసు పెట్టుతారు. జాగ్రత.

సుభా:—అప్నాకుషీ చెప్తా కేసు తప్పించు. మారావుకి కైసా చోర్ మాల్ ఆయా?

దేశా:—వాడే దొంగ. పోలీసునుండి తప్పించుకోవలయునని యిక్కడ చేరినాడు.

సుభా:—నేను అనుకున్నాన్. వాన్కి బలేయుక్తి. రహస్యంబీరతా, క్యాకీ దెఖ్నా, క్యాకాంబీ దివానా కాంకర్తా. నైతో అంతడబ్బు యేజంటుకీ కైసా ఆతా.

దేశా:—నీవు యీదినం రామారావువద్దకు పోకూడదు? అతనిని రేపు పోలీసువారు పట్టుకునేటట్టు చేస్తాను.

సుభా:—అల్లా. నాకు తప్పించు మీదిగులాం. బచ్చేవాలాహై మేర్బానిఖరో మహారాజ్.

దేశా.—ఏమీ భయములేదు.

సుభా:—మహారాజ్, వాన్కి బెజవాడమే ఏక్ జో స్త్రీహై వాడుబీ ఐసా రతాదేఖో మైబోల్తు.

దేశా:—నీవు పోలీసువాండ్లతో అంతచెప్పు. లేకపోతే చెడిపోతావు.

సుభా:—అచ్ఛా. ఎంతపని అయిందిజే. మావాడు వాన్కిందపని చేసేదేమి. బడాదొంగహై. యిది తప్పించుకుంటే చాలు. మహా హాదుష్టం అనుకుంటాను. సలాంజీ.

నిష్క్రమింతురు.

---

## పంచమాంకము.

### స్థలము 2. ఇల్లు (రామారావు గృహము.)

(ప్ర: రామారావు.)

(పడకపైనుండి బ్రాందీ కొంచెము త్రాగుచు,)

ఆహా! నా నాటకమున యీబ్రాందియే ముఖ్యపాత్ర. దీనివల ననే పోలీసువారిని జయించితిని. దీనివలననే చోరీ చేసితిని. దీనివలనే ఖూనీలు చేసితిని. దీనివలననే నాకష్టములు మరచి దేవేంద్రునివలె సుఖ పడుచుంటిని. దీనివలననే కొందరు భయపడుచున్నారు. ఆహా! బ్రాందీ రాజమా! నిన్ను తెలియనివారు లోకమున తుచ్ఛులు. నీలోనున్న సత్వము గ్రహించిరా! నిన్ను విడువరు. ఐశ్వర్యవంతునికి ముఖ్యము. దొంగలకు అంజనము. కష్టజీవికి ఆవు. అట్టి నిన్ను దేవుడేల నదులవలె ప్రవహింపచేయడు? పండ్రెండు సంవత్సరముల కొకతూరియైన పుష్క రమువలెనైన రాకూడదా?

### దండకము.

శ్రీమన్మహాబ్రాందిసీసా సదభ్యాసభాసా మహాసత్వకారీ మహా యోగకారీ మహామాయకారీ ప్రపంచాధికారీ సదానందరూపా ప్రతాప ప్రదీపా మహాకష్ట ఘోరాట వీవహ్నికీలా సుధీలోకశూలా విదేశ ప్రభూతా స్వదేశప్రభూతా మున్ను మారేవతీకాంతుడెల్లప్పుడున్ నిన్ను సేవించిగాదే జయించెన్ ప్రలాంబాది క్రూరాసురవ్రాతమున్ మొన్న మొన్నన్ మహాకాళిదాసుండు నీసేవగావించి గాదేరసోత్కృష్టమౌకైత లన్ చెప్పి యీనాటికిన్ గూడ విద్వద్వరేణ్యోత్తమాంగంబులన్ భేషు భేషంచు త్రిప్పింపడే, శ్రీమహాదేవికిన్ ప్రాణతుల్యంబవై కీర్తియార్జిం పవా, వైనువై బ్రాందివై లిక్కరై పెక్కునామంబులన్ దేశదేశంబు లన్ రూపరూపంబులన్ వ్యాప్తికిన్ వచ్చి శ్రీవిష్ణువున్ మీరవా పెద్ద పెద్దక్షురాలన్ భలే చిత్రచిత్రాలతో గోడపై, బస్సుపై కారుపై దానిపై

దీనిపై నాడునుఁ నేడునుఁ మంచి అడ్వర్టయిస్మెంటు బొందవా వున్న తోద్యోగులఁ చేరవా నేటిప్యాషన్లనుఁ పోషునుఁ నీవు మానేజరేకావ ప్రఖ్యాతికిఁ రావ యింతేల నీమంత్రుడౌ భంగి, నీనేస్తు సిగ్రేటు, నీ ప్యూను హుక్కా భవద్దాస దాసీలు భోగాంగనల్ చుట్టు సేవించు చుండంగ మధ్యే మహారాజశీవిఁ విరాజిల్లు నీమూర్తి దర్శించినఁ నిన్ను ధ్యానించినఁ నీదు సాన్నిధ్యముఁ బొందినఁ నీసుగంధంబు ఘ్రాణించినఁ నిన్ను ఆవాహితుంజేసి ఐక్యానుసంధానముఁ జేసినఁ వేరె కైవల్యముంగల్గునే వేరె స్వర్గంబు చూపట్టునే వేరె వైకుంఠమేదీ మరేలోకమేదీ భవత్సేవచేకానిదేదీ, భవద్దివ్యమూర్తిఁ భవత్త్రివస్మూర్తిఁ కనంబోని వాడెట్టివాడైన నీచాతినీచుండుగా మారడే రోజుకో సారి దర్శించినఁ చాలదే కష్టముల్ కూలవే కేసులున్నిల్చునే తేరి చూడంగ పోలీసువారుందురే భక్తుడఁ గావవే నన్ను రక్షింపవే బ్రాంది రాజా, మహాపానరాజా, నమస్తే నమస్తే నమః. (బ్రాందిత్రాగును.)

ఆ! యీదినము శుక్రవారము. రేపు పద్మావతమ్మగారు తన కుమార్తె విషయమై చెప్పుటకుగడవు. నేను యేదోరహస్యముగల్పించి నా తెలివితేట లుపయోగించి ద్రవ్యము లాగటమేకాక, పెండ్లికికూడా ఒకయెత్తు యెత్తినాను. తప్పక గెలిచెదను. అప్పుడు నంజుండరావుకు అల్లుడనై, యీవూరిలో గొప్పవాడగుదును. కొంచెము టిక్కుమంటే నంజుండరావుగతి పైకి. అప్పుడు ఆ ఆస్తియంతయు నాదేలయి నేను ధనవంతుడగుదును. ఏదీ! (అని బ్రాందీ త్రాగుచు) నావంటి ధన్యాత్ము డిల గలడే? అదృష్టము నన్నుచూచి బెదరి దూరముగా పోవుచుండ వెంట్రుకలుబట్టుకొని వద్దకులాగి వెంట యీడ్చుకొని వచ్చుచున్నాను.

ప్ర: నరసింగరావు, దేశానంద.

నర:—రామారావు.

రామ:—కం ఆఁ నమస్కారం. రండీ కూర్చోండి. (స్వ) అరే! ఏదో తంటా బాబతుగావుందే. (ప్ర) ఏమిలా దయ కలిగింది.

నర:—మీవలన మాకు కీర్తిగలుగు కాలమువచ్చినది. అందుకు దర్శనమునకై వచ్చితిని.

రామ:—కీర్తియా? ఏమి ఆశ్చర్యము.

నర:—బెంగుళూరు బ్యాంకి డెకాయిటీ కేసులోనున్న నరహరికై వచ్చినాను.

రామ:—అతను మాయింటలేడే. లోపలికి వెళ్లి వచ్చెదను. క్షణ మాగండి?

నర:—ఇచ్చటినుండి కదలకూడదు.

రామ:—(పరుపుపై వంగి వెతుకులాడును.)

నర:—Hold up. (హోల్డు అప్) లేదా! తల యెగిరిపోవును.

రామ:—నరసింగరావు! నాయిల్లు నాటకరంగ మనుకొంటివా? ఏమి ఆటలాడించుచున్నావు.

నర:—నీవు హైదరాబాదులో చోరీమాలు అమ్మినది తెలుసును.

రామ:—ఈస్వాములవారి మాటలు వింటిరేమో కదా!

నర:—నీవు నంజుండరావుగారి భార్యతో తీసికొనిన సంగతి తెలిసినది.

రామ:—(వికటంగా) ఆసుభా౯ ఖా౯ మాటలువిని చెడిపోవుచున్నావు నాతలకంటే ముందు నీతల చెడియున్నది. జాగ్రత మావంటి పెద్దమనుష్యులను అవమానముచేసిన నీగతియేమగునోజాగ్రత!

నర:—నరహారీ! రా స్టేషనుకు నడచు. నీకు బెంగుళూరినుండి వచ్చిన వుత్తరములుకూడా దొరికినవి.

రామ:—అరే! దుర్మార్గా! యింతవరకు నన్ను తేరచూచు మగవారు కలుగలేదు. స్టేజిపై ఆడుదానివేషమువేయు నీవే నన్ను పట్టు

కొనగలవా? నీవీగృహము చేరుటకుముందే కడసారి నీభార్యను చూచి వచ్చితివా? లేదా. పాపము నీవు పిల్లలు కలవాడవు. వెడలిపొమ్ము. నరహరి నామొదటిపేరు. కూనీలుచేసిన తరువాత నాకు నామిత్రులిడిన ముద్దుపేరు. 'నరహరి' యనిన అర్థమాయెనా? నీగతి యేమగునో భద్రము. (అని రివ్వున ఇన్స్పెక్టరుగారిమీద కెగురును.)

నర:—(పిస్తోలు గురిపెట్టును.)

రామ:—(నిశ్చేష్టితుడై)

నర:—కానిస్టేబిల్ వీనికి బేడీలు వెయ్యి. (బేడీలు వేసెదరు.)

నిష్క్రమింతురు.

—❧❧—

# పంచమాంకము.

## స్థలము 3. ఇల్లు (శ్రీనివాసరావు గృహము.)

[ప్ర: శ్రీనివాసరావు, దేశానంద.]

దేశా:—రావుగారు, మామహిళామండలికి సరోజాభాయిగారు చేయుచున్నంత సహాయము మెవరును చేయుటంలేదు. ఆయమ ఓపికే ఆయమకే గలదు.

శ్రీని:—ఏమోలెండి. నేనంతగా తెలిసికొనుచుండుటలేదు.

దేశా.—శ్రీమతి సరోజాభాయివంటి వుత్తమగృహిణి నేనెచ్చటను చూచియుండలేదు. ఆయమ చాకచక్యము, తెలివితేటలు, అపూర్వము. నంజుండరావు రేపు కమలా వివాహమప్పుడొక వేయిరూప్యములు మామండలికి యిచ్చుచున్నారు.

శ్రీని:—కమలను రాజా కవికుమారునికి యిచ్చి వివాహము చేయుచున్నారు. కవికుమారుడిప్పుడే మాకు వివాహపత్రికెల నొసంగిపోయెను. నన్నచటికి తప్పక రమ్మని చెప్పిపోయినారు.

దేశా:—శ్రీనివాసరావుగారూ,

ప్ర: సరోజ.

దేశా:—అమ్మా! కవికుమారీ! నీకై వేచియుంటిని!

శ్రీని:—స్వామి! కొత్త పేరిడితి రేల?

దేశా:—అయ్యా! ఈసీములో రాజా కవికుమారుకు తప్ప కవితాశక్తి గలవారు సరోజాభాయియే కావున, ఆయమ కవికుమారిని అని మామండలిలో నామకరణము గావించితిమి. కవితా గర్భమున నిరువురు జనియించుటచే నీపేరిడితిమి.

శ్రీని:—(ఆశ్చర్యపడి) అటులన?

దేశా:—అమ్మా! రేపు వివాహానంతరము వధూవరులకు మన మండలిలో నొక చిన్న విందొసంగుదుము. తల్లీ యింతలో నెంత మారితి ?

సహజసౌభాగ్యరూపలక్షణము మెరయ
భవ్య దేశీయవస్త్ర సంభరితవాచు
పశ్చిమాచారవిధ్యకు పరమకీర్తి
దెచ్చితివి నీవిటు సరోజదేవిసాధ్వి!

ఆహా! నీ అపూర్వ సౌందర్య మిన్నాళ్లు దాచియుంటివి కదా! రేపుమాత్రము తప్పక వివాహవిందునకు తయారు కావలయును.

(వెడలిపోవును.)

సరో:—(వెనుకకుతిరిగి పోబోవును.)

శ్రీని:—సరోజా! ఏలతలవాల్చుకొని పోవుచున్నావు. ఇటుచూడు?

సరో:—(విదిలించుకొని) మీఅనురాగమునకు తగను. కులటనుగదా?

శ్రీని:—సరోజా! క్షమింపుము. యీదీనుని, నీవు ఏదో ద్రోహము చేసితివని తలంచి నిన్న నరాని మాటలనంటిని. కాని నాకుబుద్ధి వచ్చినది. నీవునిజముగా స్వతంత్రురాలవు. నీవిప్పుడు నాకుపరాభవము గల్గించితివి. నీయందున్న గాంభీర్యము, శక్తి, సహాసనాయందు లేకనన్ను వెక్కిరింపు చున్నవి. సరోజా! నన్ను క్షమింపవా?

సరో:—లెండి. మీకు యిప్పటకిని పిచ్చితలంపులు లేవుకదా. అంతే చాలును. గుణవర్ణనలు క్షమాపణలు వలదు.

శ్రీని:—సరోజా! నీవటుల కఠినము వహించిన నేను తాలగలనా? నేను నిన్న ప్రప్రథమమున చెన్నపట్టణములో చూచినప్పటినుండియు నీయెడ నమిత్రప్రేమతో, ఏమనిన ఏమనుకొందువోఅని చరించుచుంటినిగదా. ఏల తెలియక అనిన మాటలకింత విరోధింపవల

యునా? ఇప్పుడు నీవు గైకొనిన యీవేషమునకు మాత్రము నీ యాకోపము తగునా.

సరో:—మీవద్ద మాకోపమెందులకు. అనిపించుకొంటినే అను ఆత్మ గౌరవముతో కృశించి యుంటిని.

శ్రీని:—భర్తయనిన తప్పుగాదు.

సరో:—భర్తకు హక్కులేదని కాదు. కాని దానివలన భర్త మనస్సు విరుగునేమో అని భయముకదా!

శ్రీని:—సరోజా అనుమానమేల? నీపైనాకింతయేని కినుకయుండిన— యేమి ప్రమాణము కావలయును?

సరో:—అక్కరలేదు లెండి. అంతదయ కలిగిన ఈ సరోజ నిజముగా ప్రపంచములో నుత్కృష్ట,

ప్రకృతిచెయిసేయనిమ్ము సంప్రాప్తతరుణ
మెంతో బురికొల్పనిమ్ము, ఖండాంతవిద్య
మనసుఁశాసింపునిమ్ము సంపన్నగృహిణి
హద్దుమీరునె? ధర్మసిద్ధాంతమేల?

మా మానసంరక్షణ, మీభయములచే గాదు, మాస్వబుద్ధితో నగును.

శ్రీని:—My dear, పోనీ రేపు వివాహ విషయములో బహు బాగుగా అరేంజ్ చేసేయి.

సరో:—రేపటితో మరింత బాగుండును. లెండు.

నిష్క్రమింతురు.

తెరబడును.



## పంచమాంకము.

### స్థలము 4. మహిళామండలి.

[ప్ర: నంజుండరావు, పద్మావతీదేవి, శ్రీనివాసరావు, కవికుమార్, పురోహిత, సరోజా. కమల, దేశానంద.]

దేశా:—ఆర్యులారా! మహిళామండలి స్థాపన సార్థకమైనది. రహస్య భేదంబును సంశయచ్ఛేద మొనర్చి వివాహ మొనగూర్చినది. శుభ ప్రారంభమర్థజయమే.

సరో:—

ఉ. ఈసుమరాజ మీవిక గ్రహింపుము నాహృదయానురాగ సం
భాసితసౌరభాన్వితము భావవిహారవిలాససంతతా
భ్యాసము సంతతంబు ప్రణయంబున దీనిని వాడకుండగా
జేసి స్మరింపగావలయు శ్రీమతివైన సరోజ సోదరా!

అవనిక దిగజారును.

శాంతి. శాంతి. శాంతి.





# తప్పొప్పుల పట్టిక.



| పుట. | గీటు. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 16 | 13 | నాయందు | మీయందు |
| 16 | 23 | స్వతంత్రివి | స్వతంత్రవు |
| 18 | 2 | సాదశాల | సౌధశాల |
| 18 | 23 | జన్మించిన | జన్మించి |
| 19 | 22 | కోరర్వు | కోర్వరు |
| 23 | 20 | రజస్వలు | రజస్వల |
| 24 | 4 | భీ | ఛీ |
| 26 | 17 | అవగుంఠన మే | అవగుంఠననూ |
| 28 | 12 | పూర్వపుణ్య | పూర్వభవపుణ్య |
| 36 | 2 | మనోసంబంధము | మనస్సంబంధము |
| 36 | 9 | పంచయ | పరిచయ |
| 41 | 4 | స్పూర్తి | స్ఫూర్తి |
| 43 | 3 | ఉధ్యానము | ఉద్యానము |
| 59 | 19 | ప్రలాంబాది | ప్రలంబాది |
| 60 | 1 | యిస్మెంటు | యిస్మెంటులన్ |
| 64 | 6 | విధ్య | విద్య |
| 65 | 14 | శాసింపు | శాసింప |
| 66 | 14 | శాంతి | శాంతిః |

షరా:—అనుబంధములు యిందు చేర్చలేదు.

